## కృష్ణా జిల్లా రచయితల సంఘం

## కీ॥శే॥ మండలి వెంకటకృష్ణారావు ప్రతిభాపురస్కారం - 2008

అగాధమైన భాషాశాస్త్ర మహార్ణవాన్ని చారిత్రాకాధార మంథరంతో మథించి, తెలుగు పలుకుల స్వరూప స్వభావావిష్కారమొనర్చిన మీ అశేష శేముషీ వైశిష్ట్యాన్ని ప్రత్యక్షంగా సందర్శించగలిగింది ఆంధ్రలోకం. పరిశీలన, పరిశోధన, పరిష్కారము ముప్పేటలై పెనగొని భాషా సరస్వతిని మూర్తీభవింపచేసిన పరిణత సారస్వత మూర్తికివే అక్షర నీరాజనాలు.

## Citation Presented at
## Gangadevi Eminent Citizen Award - 2005

The glory of a language is enhanced by those who strive all through their life for sustaining its greatness through systematic research into its intricate aspects like etymology, sound symbolism, early inscriptions and every corner of grammar. It is a fact that those who are highly proficient in sanskrit and their mother tongue produce excellent research work. Sri Mahadeva Sastri Korada is such an eminent contributor to the glory of Telugu.

**డా॥ మండలి బుద్ధ ప్రసాద్,**
**శాసనసభ ఉప సభాపతి,**
**ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం**

# తెలుగు భాష - కోరాడవారి కృషి

తెలుగుభాషా సాహిత్యవికాసానికి కోరాడ వంశీకులు చేసిన సేవ మహత్తరమైనది. తెలుగుజాతి సదా స్మరించవలసిన మహత్తర కుటుంబం వారిది.

తెలుగులో తొలినాటకం "మంజరీ మధుకరీయం" రచించిన ఘనత శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రిగారికి దక్కింది. సంస్కృతాంధ్రభాషల్లో అనేక రచనలు చేసిన మహాపండితుడాయన. వారి మనుమడైన శ్రీ కోరాడ రామకృష్ణయ్య తెలుగు భాషాపరిశోధనకు కొత్త ద్వారాలు తెరిచి, కొత్త పుంతలు త్రొక్కించారు. తెలుగు పరిశోధనారంగ వైతాళికుడై, తెలుగు భాషావ్యాకరణాధ్యయనంలో ఆధునిక భాషాశాస్త్రపద్ధతిని, తెలుగు సాహిత్యాధ్యయనంలో పాశ్చాత్య సాహిత్య విమర్శనాసూత్రాలను ప్రవేశపెట్టిన ఘనత వారికి దక్కింది. అంతేకాక, వారు తులనాత్మక అధ్యయనానికి కూడా శ్రీకారం చుట్టారు.

అసిధారావ్రతంగా పరిశోధనలు చేసి తెలుగుభాషాసాహిత్యాలకు అజరామరమైన సేవ చేశారు రామకృష్ణయ్యగారు. తెలుగుభాషాసాహిత్యాలు నిలచి వున్నంతకాలం శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారిని స్మరించుకుంటారు.

శ్రీ రామకృష్ణయ్యగారి రెండవ కుమారుడు డా॥ మహాదేవశాస్త్రి తండ్రిని మించిన తనయులు. తండ్రిగారి పరిశోధనాకృషిని వారు మరింత ముందుకు తీసుకువెళ్ళారు. మహాదేవశాస్త్రిగారు ఆర్థికశాస్త్రంలో ఎం.ఏ. పట్టా చేపట్టి, కేంద్ర కార్మికశాఖలో ఉన్నతోద్యోగిగా పనిచేస్తూ, తండ్రిగారి స్ఫూర్తితో పరిశోధనారంగంవైపు దృష్టి మరల్చి, ఉద్యోగం మానుకుని, కలకత్తా విశ్వవిద్యాలయం నుంచి భాషాశాస్త్రంలో ఎం.ఏ. పట్టా పొంది, డా॥ సునీతి కుమార్ ఛటర్జీ పర్యవేక్షణలో "ది హిస్టారికల్ గ్రామర్ ఆఫ్ తెలుగు" అనే అంశంపై పరిశోధన చేసి, డి.లిట్. పట్టా పొందారు. "తెలుగుభాషా పరిణామం వివరించే చారిత్రక వ్యాకరణరచనకు యువకులు పూనుకోవాలి" అని శ్రీ కోరాడ రామకృష్ణయ్య చేసిన ఉద్బోధను ఆయన కుమారుడే నిజం చేశారు. మహాదేవశాస్త్రిగారు విదేశీయులు తెలుగు నేర్చుకోవడానికి "Descriptive Grammar and Handbook of Modern Telugu" అనే గ్రంథాన్ని ఆంగ్లంలో రచించారు. జర్మనీలోని ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఇండాలజీలో విజిటింగ్ ప్రొఫెసర్‌గా, శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖాధిపతిగా పనిచేశారు. భాషాశాస్త్రంలో ఆచార్య మహాదేవశాస్త్రి చేసిన కృషిని దేశ విదేశ భాషాశాస్త్రజ్ఞులు ఎంతగానో కొనియాడారు. కృష్ణాజిల్లా రచయితల సంఘం నెలకొల్పిన మండలి వెంకట కృష్ణారావు స్మారక పురస్కారం డా॥ మహాదేవశాస్త్రిగారికి ఇచ్చి గౌరవించుకొనే సదవకాశం మాకు కలిగింది. ఆ సందర్భంలో మహాదేవశాస్త్రిగారి కుటుంబ సభ్యులతో పరిచయం ఏర్పడింది. వారందరూ విద్యావినయ సంపన్నులు. గొప్ప సంస్కారవంతులు. బోధనారంగంలో నాలుగు తరాలుగా కోరాడ కుటుంబం వందలాది మందిని విద్యావంతులుగా తీర్చిదిద్దింది.

"దేశభాషలందు తెలుగు లెస్స" అని దేశీయ పండితులచేత, "ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్" అని పాశ్చాత్యుల చేత కొనియాడబడిన తెలుగుభాష ఇంత ఉత్కృష్టస్థితికి రావడానికి వెనుక ఎందరో మహానుభావుల కృషి వుంది. వారిలో కోరాడ వారు చేసిన కృషి ఎన్నదగింది.

**మండలి బుద్ధ ప్రసాద్**

★ (భాష – సంస్కృతి గ్రంథపీఠిక నుండి గ్రహింపబడినది)

# స్మృత్యంజలి

**డా॥ పి.వి. అరుణాచలం,** విశ్రాంత ఉపకులపతి,
ద్రావిడ విశ్వవిద్యాలయం, కుప్పం.
సెల్ : **9441075075**

ఒక సుప్రసిద్ధమైన తెలుగువంశం భాషాపరిశ్రమలో సాధించిన విజయాలు, ఫలితాలు అద్భుతం – కోరాడ వంశస్తులు పదితరాల వారు ఈ భాషాసాహిత్య ప్రస్థానంలో భాగస్వామ్యులు –

*కోరాడవంశమండను*
*లారాధ్యులు, మధుర సంస్కృతాంధ్రమ్ములలో*
*పారంగతులు, కవిత్వక*
*ళారాధనతత్పరులు మహాపూతాత్ముల్ ॥*

ఈ అపూర్వమైన కృషినిబోలిన కృషి ఒకటి గణిత శాస్త్రచరిత్రలో కనబడుతుంది. ఆ కృషి 17, 18 శతాబ్దాలు, 19వ శతాబ్ది తొలిదశకం వరకు విస్తరిల్లింది– బెర్నౌలీ వంశ గణితపండితుల శాస్త్రకృషి – గణిత చరిత్రలో అపూర్వమైన అంశం, ఒక విలక్షణమైన అధ్యాయం.

*పలు తెరగుల బెర్నౌలీ*
*కులమండనులు గణితమునకు*
*తరతరాల్గా విలువైన భూషలిచ్చిరి*
*విలక్షణమిది చరితమున విననబ్బురమౌ ॥*

బెర్నౌలి వంశస్థులు స్విట్జర్లాండు, రష్యా, జర్మనీలలో వారి గణిత వ్యవసాయాన్ని సాగించి తరించినారు.

కోరాడ వంశమణిదీపాలను గురించి చదివినప్పుడు, ఈ బెర్నౌలీవారి గణితచరిత్ర జ్ఞప్తికి వచ్చింది.

మనకు తెలియవచ్చినంతవరకు, ఆది మహాదేవశాస్త్రి, లక్ష్మణశాస్త్రి, రామచంద్రశాస్త్రి (1816–1900), లక్ష్మీమనోహరం, రామకృష్ణయ్య (1891–1962)ల తరువాత మన ఆచార్య మహాదేవశాస్త్రి తరం, తరువాతి తరంలో రామకృష్ణ, వేంకటరమణ, ఆచార్య సూర్యనారాయణ, శ్రీమతి విజయలక్ష్మిలు – ఈ నలుగురు వీరి చిరంజీవులు.

ఈ కోరాడ వంశంలో శ్రీశైలభ్రమరాంబికా వరప్రసాదలబ్ధులు, సర్వశాస్త్రపారంగతులు, కాశీకి వెళ్ళి శాస్త్ర పాండిత్యాన్ని కైవశం చేసుకున్నవారున్నారు. రామతారక ఉపాసకులు, మహాశాస్త్ర పండితులు, షట్శాస్త్ర పండితులు, ఏకసంతాగ్రాహులు, అంతర్ముఖులు, యోగులు, స్థితప్రజ్ఞులు పూర్వతరంవారు. పంతొమ్మిదోశతాబ్ది చివర జన్మించిన బ్రహ్మశ్రీ రామకృష్ణయ్యగారితో ఆ వంశం తాలూకు అభిరుచిలో మరో కొత్త కోణం ఏర్పడింది. తెలుగు భాషాశాస్త్ర పరిశోధనకు వారు శ్రీకారం చుట్టారు.

తెలుగుభాషకి సంబంధించినంత వరకు పరిశోధన – బ్రౌన్ కాలంలో భాషాధ్యయనం, కాల్డ్‌వెల్ కాలానికి తులనాత్మక దృష్టి, చిలుకూరి నారాయణరావుతో సిద్ధాంత వ్యాస గౌరవస్థాయి కొనసాగిన నేపథ్యంలో కోరాడ రామకృష్ణయ్య అభ్యుదయభావనతో అనుశీలనాత్మక చర్చావేదికగా వెలిగింది. తర్వాత గంటి జోగిసోమయాజి వల్ల ప్రామాణిక పరిశోధనాగౌరవాన్ని, భద్రిరాజు కృష్ణమూర్తి శ్రమతో ప్రక్రియావైవిధ్యాన్ని భాషా సమస్యల పరిష్కార వైఖరినీ సాధించినది. తెలుగు భాషా, వ్యాకరణ అధ్యయనంలో ఆధునిక భాషాశాస్త్ర పద్ధతిని, తెలుగు సాహిత్యాధ్యయనంలో పాశ్చాత్య విమర్శన సూత్రం సమన్వయాన్ని ప్రవేశపెట్టిన అభ్యుదయ వైతాళికులు శ్రీ కోరాడ రామకృష్ణయ్య. ప్రాక్ ప్రతీచీ విజ్ఞానాలను, సాహితీ సంప్రదాయాలను జీర్ణించుకొని తెలుగు భాషా – సాహిత్యాలలో స్వతంత్ర విమర్శన దృష్టిని ప్రవేశపెట్టినవారు. వారు దక్షిణాంధ్ర భాషలమీద చేసిన పరిశోధన అంతా ఇంతా కాదు. ఆచార్య మహాదేవశాస్త్రిగారు నిరుపమాన భాషాశాస్త్ర పరిశోధనాకృషితో పురోగతిని సాధించినది. తెలుగు శాసనాలు, భాషాపరిణామాన్ని నిర్దేశించిన తీరుతెన్నులు పరిశీలించడం వీరి భాషాకృషిలో ఒక విశిష్ట పార్శ్వం.

ఈ మహత్తరమైన తెలుగునకు అర్వాచీనమైన భాషాశాస్త్ర కృషితో రామకృష్ణయ్య నారు వేస్తే, మహాదేవశాస్త్రి నీరు పోసి పెంచారు. తండ్రికి తగ్గ తనయుడుగా

యశశ్చంద్రికలను విస్తరించినారు ఆచార్య మహాదేవశాస్త్రిగారు.

'తెలుగువారెవరూ భాషాశాస్త్రరంగంలో కొత్త సిద్ధాంతాలు ప్రతిపాదించడం జరుగలేదు" అన్న వాదాన్ని మొట్టమొదట పూర్వపక్షం చేసిన పండితులు ఈ "అబ్బా కొడుకులు" ; అందువల్లే ఈ కొడుకును ప్రస్తుతిస్తూ "ఈక్షోణిన్ మిము బోలు పండితులు లేరీనాటి కాలమ్ములో" అనాలనిపిస్తుంది.

భాషాపరిశోధనకు స్వతంత్ర ప్రక్రియాగౌరవాన్ని అందించిన కోరాడ రామకృష్ణయ్య, మహాదేవశాస్త్రుల వైదుష్యానికి జేజేలు.

"మనమధ్య ఉన్న తెలుగు తెలుసుకోవాలంటే మనకు ఉన్న మన సంపద" ఆచార్య మహాదేవశాస్త్రిగారు. వీరు భాషాశాస్త్రరంగంలో పండితశిఖరాలైన మహామహులతో, జ్ఞానసింధువులతో సహస్కంధులుగా వ్యవహరించినారు. మీనాక్షి సుందరం పిళ్ళై, సునీతికుమార్ ఛటర్జీ, సుకుమార్ సేన్, క్షితిష్ చంద్ర చటర్జీ, యం.బి. ఎమెనో, టి.బర్రో, ఆల్‌ఫ్రెడ్ మాస్టర్, ఐ.వి. సుబ్రమణ్యం, ఐరావతం మహాదేవన్ మొదలైనవారిని మెప్పించి, వారి ప్రశంసలు అందుకున్న శ్రీ కళాపూర్ణులు డా॥ మహాదేవశాస్త్రిగారు. వారి పాండిత్యానికి ఖండాంతరాలలో ప్రశంసలు కురిశాయి. పురస్కారాలు అందాయి.

వీరు రచించిన గ్రంథాలు, పరిశోధనాపత్రాలు ఆషామాషీ కృతులు కావు. అన్నిటికి అగణ్యమైన Citation Index లుంటున్నాయి. వాటికి ఆచార్యులిచ్చిన శీర్షికలే అపూర్వాలు. అవశ్యపఠనీయాలుగా విద్వల్లోకం వీటిని గుర్తించింది.

కావ్యభాషాపరిణామం, Sound Symbolism in Telugu, Language of Telugu Inscriptions of the 12th and 13th Centuries, Prakrit Inscriptions in Andhra, ప్రాఙ్నన్నయ శాసనభాషలో గ్రాంథిక – వ్యవహారిక భాషాభేదములు, Folktale in Western Bhojpuri, మొదలగు పరిశోధక వ్యాసాలు, తెలుగువాఙ్మయ పరిచయం, Descriptive Grammar and a Hand Book of Modern Telugu, వ్యాకరణ దీపిక, Historical Grammar of Telugu, తెలుగు దేశ్యవ్యుత్పత్తి నిఘంటువు మొదలగు గ్రంథాలు – వీరి అమూల్యమైన రచనలలో కొన్నిటిని మాత్రమే ఉదహరించడం జరిగింది.

అందువల్లే మనం ఆచార్య మహాదేవశాస్త్రికి అభినందన చందనాన్ని అలముతున్నాము.

ఆయన ప్రజ్ఞాపాటవాలను ప్రస్తుతిస్తున్నారు.

**ఆచార్య మహాశయా ! కోరాడాన్వయ రత్నదీపమని మీకున్ జేతు సంతుష్టితో**
**హేరాళంబుగ వందనాల్ గొనుడు సాహిత్యమ్ము భాషాపరం**
**బౌరమ్యాంశములన్ మథించి బుధులాహాయంచు కీర్తింప వి**
**ద్యారంగ ప్రముఖుండువైన మహాదేవాఖ్యా ! యశశ్శ్రీముఖా ॥**

తెలుగు సంస్కృతి – భాషాసారస్వతాలు నుండి నేను రవ్వంత సేకరించినవి ఈ విషయాలు. ఇవేగాక కోరాడ వంశం పూర్వీకుల సాహితీకృషిని గురించిన ఎన్నో ఆసక్తికరమైన విషయాలున్నాయి. ఈ గ్రంథంలో వీరిలో మహిళారచయితల వ్యాసాలున్నాయి. వీరి సంప్రదాయ సంస్కృతి, సాహిత్య వారసత్వాలు చదివి ఆదర్శజీవితాల నిర్వచనాలను మనం తెలుసుకోవచ్చు. ఒక తండ్రికి కూతురుగా, అత్తమామలకి కోడలుగా, భర్తకు సహధర్మచారిణిగా, సంతానానికి తల్లిగా, మనుమలకు అమ్మమ్మగా తనదైన వ్యక్తిత్వాన్ని, చెక్కుచెదరని విశ్వాసాలతో, నిర్ణీతాభిప్రాయాలతో బ్రతికిన వారు ఈ మహిళామణులు.

కోరాడ రామకృష్ణయ్య పితామహులు కోరాడ రామచంద్ర కవి (1816–1900)గారివి ముద్రిత గ్రంథాలు 31, అసంపూర్ణ అముద్రిత గ్రంథాలెన్నో. ఘనవృత్తం, ఉపమావళి గురించిన సమాచారం ఈ గ్రంథంలో లభిస్తుంది.

ఇతర ఇతివృత్తాల మీద వ్యాసాలు కొన్ని ఉన్నాయి. తెలుగులో వేంకటేశ్వర సాహిత్యం, భారతీయ సౌందర్యతత్త్వం, రామకృష్ణయ్యగారి రచనలు కొన్ని ఇతిహాస పరిశీలనం, నన్నయ మూలమున తెలుగునకు కలిగిన మేలు, నన్నిచోడుని కుమార సంభవము, నన్నిచోడుడు కన్నడ సాహిత్యం, తమిళసాహిత్య నిర్మాత ఇలంగో (ఇల్లంగో – ఎల+కో = చిన్నరాజు) తమిళకావ్యం అగనానూరు, దేశిరచనలు గురించిన కొత్తగా తెలుసుకోవలసినవెన్నో ఉన్నాయి.

అట్లాగే డా॥ కోరాడ మహాదేవశాస్త్రిగారి రచనల పాళీభాషా వాఙ్మయములు, తిక్కన జాతీయాలు, నన్నిచోడుని దేశీయము, వైదికయుగ భాషాతత్త్వ జిజ్ఞాస, శ్రుతి వాక్య సంకరం – ప్రకృతి భావం, తెలుగు ప్రాచీనత, తెలుగుభాష తియ్యందనం, తెలుగు మాండలికాలు (సొమ్ములు = పశువులు కళింగమాండలికం) అన్యదేశ్యక్రియా నిర్మాణం, తెలుగు విభక్తి

(ఉత్కర్షార్థం – సామన్యార్థకం)
భిక్ష (స్వాములవారికి) – బిచ్చము (బిచ్చగాడికి)
సన్యాసి – సన్నాసి
దర్శన్ కర్న – దేఖనా
భగవాన్ కో దర్శన్ – తమాషా దేఖ్‌నా

సప్తసంతానముల – అంకితం. (నామాంకితం గ్రామదేవతల) – ఎల్లమ్మ, కూనలమ్మ, కాటమయ్య గారి దేవత మొదలైనవి వేక్స్‌ముల్లర్ – ఋగ్వేదభాష్యం, శబ్దపల్లవాలు, చంద్రశబ్దచర్య, లోక – రోచిస్ చర్చ, గోశబ్దం – శబ్దకూటములు, ఆంధ్రము – తెలుగు, శ్రీకాకుళ ఆంధ్ర విష్ణువు ఉన్నాయి. నేను వీటిని చదివి తెలియని విషయాలెన్నో తెలుసుకున్నాను.

ఈ బహుముఖ ప్రజ్ఞాశాలి, ఇహలోకాన్ని, తన సాహితీ క్షేత్రాన్ని వీడి కానరాని దూరతీరాలకు వెళ్ళిపోయారు. వారిని గూర్చిన తీపి జ్ఞాపకాలే మిగిలాయి, వారు రచించిన పుస్తకాలతోపాటు, తెలుగు భాష వెలిగినంతకాలం వారి కీర్తి ప్రకాశిస్తూనే ఉంటుంది. వారు సృజించిన, రచించిన అక్షరాలలో వారు నిక్షిప్తంగా చిరకాలం ఉంటారు గనక వారి రచనలను అప్పుడప్పుడూ పఠిస్తూ వారు తెలుగు భాషకు, సాహిత్యానికి చేసిన విశిష్టమైన సేవలను విస్మరించకుండా ఉంటుందీ తెలుగు సాహితీలోకం.

*****

# పుణ్యమూర్తి దివ్యస్మృతికి నివాళి

**'పద్మశ్రీ' కొలకలూరి ఇనాక్,** విశ్రాంత ఉపకులపతి,
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి
సెల్ : 9440243433

కీ.శే. ఆచార్య కోరాడ మహాదేవశాస్త్రిగారు నా పరిశోధనకు పర్యవేక్షకులు. వారికి నేను సర్వదా, సర్వదా కృతజ్ఞుణ్ణి.

నా పరిశోధనాంశం 'తెలుగు వ్యాస పరిణామం'

'నేను భాషాశాస్త్రవేత్తను. సంప్రదాయ సాహిత్య పరిధీప్రవర్తకుణ్ణి. ఇది ఆధునికసాహిత్య విషయం. నేను పర్యవేక్షించే అవకాశం తక్కువ. అయితే నీకు పదేళ్ళ అధ్యాపక అనుభవం ఉంది. పరిశోధనవ్యాసాలు వ్రాశావు. పది గ్రంథాలు ప్రచురించావు. నీ పరిశోధన కృషి నువ్వు చేసుకో'

హృదయ వైశాల్యం, బుద్ధినైశిత్యం ఉంటే తప్ప, ఏ పర్యవేక్షకుడు అలా చెప్పడు. ఆ స్పష్టత ఎల్లకాలం కొనసాగింది.

అధ్యాపక - పరిశోధక విద్యార్థినైన నేను నా పరిశోధన ఫలితం పదేళ్ళలోపు, నాలుగేళ్ళ తర్వాత, విశ్వవిద్యాలయానికి సమర్పించవచ్చు.

నేను నా సిద్ధాంతగ్రంథం వ్యావహారికభాషలో రాస్తానంటే, అంగీకరించి, విశ్వవిద్యాలయ అనుమతి సంపాదించారు.

మూడేళ్ళకు సిద్ధాంతగ్రంథం సమర్పిస్తానని అంటే, ఒప్పుకొని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయానికి సిఫారసు చేశారు. మూడున్నరేళ్ళకు సమర్పించాను.

'తెలుగు భాషా చరిత్ర' గ్రంథ రచనావకాశం యుజిసివారు వీరికిస్తే, అందులోనన్ను సహరచయితగా (కో-ఆథర్) తీసుకొన్నారు.

ఆ పరిశోధన స్కీంలో కృషి చేస్తున్నప్పుడు ఎం.ఏ. విద్యార్థులకు వ్యాకరణం, తెలుగు భాషాచరిత్ర, వారానికి ఆరుగంటలు రెండున్నరేళ్ళు పాఠం చెప్పే అవకాశం అనుగ్రహించారు.

ఇంతగా ఎవరు ప్రోత్సహిస్తారు ?

విశ్వవిద్యాలయంలో తెలుగు లెక్చరరు ఖాళీని భర్తీ చేసే ప్రకటన వెలువడింది. నేను అప్లై చేస్తానంటే 'తప్పక' అన్నారు.

గొప్ప 'టెస్టిమోనియల్' ఇచ్చారు. సిఫారసుకంటే బలమైనది. యం.ఏ. విద్యార్థులకు తెలుగు బోధించిన అనుభవం విశదంగా రాశారు.

ఆచార్య కోరాడ మహాదేవశాస్త్రిగారు జర్మనీ దేశంలో 'ఇండోలజీ' ఆచార్యులుగా ఉన్నప్పుడు, వారి స్థానంలో రీడరుగా నియమితుణ్ణి అయ్యాను.

వారు పదవీ విరమణ చేశాక ఆచార్యుణ్ణి అయ్యాను.

వారి ఆదరణ పుష్కలంగా ఉండటంవల్ల నా అభ్యుదయం సాధ్యమయింది.

వారి ప్రేమ, ప్రోత్సాహం గొప్ప అభివ్యక్తులు.

నేను రాసిన అధ్యాయాలు చూపితే, చూచి, అప్పుడే అక్కడే ఇచ్చేసేవాళ్ళు. రేపురా, మాపురా అని తిప్పుకోలేదు.

'నువ్వు బాగా కృషి చేస్తున్నావు. రాసుకోగలవు' అని దయగా చెప్పేవారు.

వారింటికి వెళితే, నన్ను నన్నుగా కాక, తమ బంధువుగా చూచేవారు.

వారి శ్రీమతి సరస్వతిగారు దయామయి, సహనశీలి. ప్రోత్సహించేవారు.

పిల్లలు రామకృష్ణ, వెంకటరమణ, సూర్యనారాయణ, విజయలక్ష్మి నాతో మాలిమిగా ఉండేవాళ్ళు.

శాస్త్రిగారి చిన్న కుమారుడు సూరి, నా చిన్న కొడుకు సుమ లాగా చేతికిందికి వచ్చే సన్నిహితుడు.

నేను రేపు యూనివర్శిటీకి రాలేనంటే, సరేనని, 'ఏం' అన్నారు. 'మా పెళ్ళైనరోజు' అంటే 'మేం వస్తున్నాం' అని పార్వతీ పరమేశ్వరుల్లాగా వచ్చి మమ్మల్ని ఆశీర్వదించారు.

విశేష సహాయం, అద్భుత ప్రేమ, అచంచల ప్రోత్సాహం అనుగ్రహించే ఆచార్య కోరాడ మహాదేవశాస్త్రిగారికి మాటలు పరిమితం, మనస్సు అపరిమితం.

నన్ను పరిశోధనలో చేర్చుకొన్న తొలినాళ్ళలోనే నా భవిష్యత్తును ఆశించారు, ఊహించారు, సంకల్పించారు.

అంతటి ప్రేమమూర్తి అరుదైన పుణ్యమూర్తి.
ఆ ప్రేమ, పుణ్యం తొంభై అయిదేళ్ళు ప్రశాంతంగా మెలిగాయి.
ఆ పవిత్రమూర్తి నా పర్యవేక్షకుడు కావటం నా భాగ్యం.
ఆ మహామనిషి దివ్యస్మృతికి ఈ నా నివాళి నా అదృష్టం.

*****

# శ్రీ సద్గురు సమారాధన - ప్రాచార్య కోరాడ మహాదేవశాస్త్రి

**ప్రాచార్య శలాక రఘునాథశర్మ**

సెల్ : **9866068542**

ప్రాచార్య కోరాడ మహాదేవశాస్త్రిగారు, అదృష్టం కొద్దీ నాకు లభించిన గురూత్తములలో ఒకరు. 1968 జులై 22వ తేదీన శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ స్నాతకోత్తర విద్యాకేంద్రంలో ఉపన్యాసకుడుగా ఉద్యోగంలో చేరాను. అనంతపురంలో అది ఆ సంవత్సరం జూలై 15వ తేదీ నుండి అధ్యయనాధ్యాపన కార్యక్రమాలకు శ్రీకారం చుట్టింది. గురువర్యులు మహాదేవశాస్త్రిగారు తెలుగుశాఖకు అధ్యక్షులుగా తిరుపతి నుండి అనంతపురానికి బదిలీ అయి వచ్చారు. తరువాత కొద్దికాలానికి వారి పర్యవేక్షణలో పరిశోధన ప్రారంభించాను. ఆ పరిశోధనలక్ష్యం పిహెచ్.డి. పట్టం. పరిశోధన పర్యవేక్షణలో అప్పటికే వారు చాలామంది లబ్ధప్రతిష్ఠులకు మార్గదర్శకులై ఉన్నారు. పరిశోధనాంశం "కవిత్రయ ఆంధ్ర మహాభారతంలో ధ్వనిసిద్ధాంత సమన్వయం". అది ప్రధానంగా సంస్కృత అలంకారశాస్త్రంలో సర్వోన్నత శిఖరసదృశమైన అంశానికి సంబంధించినది. కవిత్రయ మహాభారత వాఙ్మయగౌరవం గురించి విడిగా చెప్పనక్కరలేదు కదా ! అటువంటి చాలా బరువైనదీ, సాధారణంగా ఒక పట్టాన అప్పటి ఆచార్యులు ఎవరూ సాహసించనిదీ అయిన నిర్దేశకత్వానికి వాత్సల్యంతో అంగీకారముద్ర వేసిన మహాదేవశాస్త్రిగారి యందు నాకు ఏర్పడిన ప్రత్యయ గౌరవాలు మాటలలో చెప్పజాలనివి. ఇందులో మరొక కీలక విషయం కూడా ఉన్నది. ఒకవేళ వారు కాదంటే నాకు మరొక మార్గం లేదు. మాన్యశ్రీ శాస్త్రిగారు ఆ దశలో ఆదుకున్నారు. అద్భుతమైన నిర్దేశకత్వంతో పరీక్షకుల ప్రశంసలకు పాత్రమైన పరిశోధన వ్యాసం వ్రాయించారు. ఆ రోజులలో ఒక పద్ధతి ఉండేది. ముగ్గురు న్యాయనిర్ణేతలూ ఏకాభిప్రాయంగా మౌఖికపరీక్ష అక్కరలేదంటే అదొక గొప్పగౌరవం. ఆ విధంగా పిహెచ్.డి. పట్టం నాకు ప్రదానం కావటం చాలా అరుదైన విషయం. ఆ భాగ్యాన్ని కూడా దక్కేలా నిర్దేశకత్వం అందించిన మహానుభావులు మా గురువుగారు.

పరిశోధకుని శక్తిసంపదను పెంపొందించటం, ఒక చక్కని మార్గాన్ని చూపటం అనే పద్ధతిని వారు అవలంబించే వారు. దీనివలననే శ్రీ శాస్త్రిగారి పరిశోధక విద్యార్థులు అనేకులు తదనంతర కాలంలో అత్యున్నత శిఖరాలను అందుకున్నారు. అట్టివారిలో ఒకరిద్దరిని ఇక్కడ ప్రస్తావించటం సముచితంగా ఉంటుంది. ప్రస్తుతం కుర్తాళంలోని సిద్ధేశ్వరీపీఠాధిపతులైన వారు, పూర్వాశ్రమంలో ప్రసాదరాయకులపతిగా సుప్రసిద్ధులైనవారూ ఒకరు. డా. కల్లూరి నాగభూషణరావుగారనే ఒక మహితాత్ముడు రెండవవారు. ఆచార్య లింగంనేని బసవశంకరావుగారూ, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం కులపతి పదవిని స్వశక్తితో అందుకున్నవారు ఇటీవలనే పద్మశ్రీ ప్రఖ్యాతిని పొందినవారు అయిన ఆచార్య కొలకలూరి ఇనాక్‌గారు మొదలైనవారు మరికొందరు. వీరందరూ మహాదేవశాస్త్రిగారి నేతృత్వంలో పరిశోధన పట్టాలందుకొనిన భాగ్యవంతులే.

మహాదేవశాస్త్రిగారికి పాఠప్రవచనం మీద అత్యంతమైన అనురాగం ఉండేది. అనంతపురం స్నాతకోత్తర విద్యాకేంద్రానికి ఆయన దాదాపు ఏడు సంవత్సరాలు స్పెషల్ ఆఫీసర్‌గా, ప్రిన్సిపాల్‌గా ఉన్నారు. కానీ అది సాకుగా తీసుకొని ఏ ఒక్కరోజూ ఆయన పాఠప్రవచనాన్ని ఉపేక్షించలేదు. పైగా శాఖలో ఉన్న సహాధ్యాపకులు ముగ్గురూ సెలవుమీద వెళ్ళినపుడు అయిదు గంటలూ ఏకధాటిగా పాఠం చెప్పిన దినాలు గణనీయంగా ఉన్నాయి. శాఖాధ్యక్షులైనా, కళాశాలాధ్యక్షులైనా సమానంగా కార్యభారాన్ని పంచుకున్నారు తప్ప ఏ మాత్రమూ తగ్గించుకోలేదు. ఇది బహుశః ఆచార్యకత్వంలో చాలా అరుదైన విషయం.

సంప్రదాయ వ్యాకరణాన్ని, ఆధునిక భాషాశాస్త్రంతో సమన్వయించి వారు అనేక విషయాలు తెలియజేస్తుండేవారు. పోతన భాగవతపద్యాలను శ్రుతిసుభగంగా ఆలపిస్తూ ఉండటం వారికి అత్యంతప్రియమైన విషయం.

వారు వాఙ్మయజీవితంలో ప్రధానంగా ఉపాసించినది శబ్దవిద్య. మరొకమాటలో శబ్దబ్రహ్మోపాసన. "శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరం బ్రహ్మాధిగచ్ఛతి" అని తత్త్వవేత్తలు ప్రవచించారు. వారికి ఆ ఉపాసనామార్గం వారి తండ్రిగారి నుండి వచ్చిన

ఆస్తి. వారి నాయనగారు బ్రహ్మశ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు భాషాతత్త్వానుశీలనంలో క్రొత్త పుంతలు త్రొక్కి సమానులలో ఉత్తమ శ్లోకులయిన మహనీయులు. అంతేకాదు వారి మేనమామగారూ, మామగారూ అయిన బ్రహ్మశ్రీ వేదమూర్తులు ఖండవల్లి సూర్యనారాయణ శాస్త్రిగారు కూడా గొప్ప వాఙ్మయ కృషీవలులు. శ్రీ మహాదేవశాస్త్రిగారి పూర్వతరాలవారు కూడా మహావిద్వద్వరేణ్యులుగా పేరు ప్రఖ్యాతలు గాంచిన వారు. ఆ యందరివాఙ్మయారాధన ఫలం శాస్త్రిగారిలో పుష్కలంగా ప్రవేశించింది. దానిని "పాదం శిష్యః స్వమేధయా" అన్నట్లు తమ మేధాపాటవంతో ప్రకాశవంతం అయ్యేట్లు చేశారు.

మహాదేవశాస్త్రిగారి అక్షరోపాసన మహాయజ్ఞానికి బ్రహ్మ, హోత, అధ్వర్యువు, ఉద్గాత అనదగిన మహాత్ములు ప్రపంచ ఖ్యాతిగాంచిన ఆచార్యవర్యులు సునీతి కుమార్ ఛటర్జీ, సుకుమార్‌సేన్, క్షితీశ్ చంద్ర గార్లు. పేర్లనుబట్టి తేలికగానే గ్రహించవచ్చు – ఆచార్యులందరూ ఉత్తర హిందూస్థానానికి, ముఖ్యంగా కలకత్తాకు చెందినవారని. దీనివలన తెలిసే మరొక రహస్యం ఏమిటంటే మహాదేవశాస్త్రిగారు సంస్కృతాంధ్రాంగ్లభాషలతో పాటు బెంగాలీ, హిందీ మొదలైన అనేక భాషలతో గాఢమైన పరిచయాన్ని పెంపొందించుకున్నవారు అని. ఉత్తర హిందూస్థానం నుండి తిరిగి వచ్చిన తరువాత వారు కొన్నాళ్ళు అన్నామలై విశ్వవిద్యాలయంలో భాషాశాస్త్రాధ్యాపకులుగా ఉండటంవలన దక్షిణభారత భాషల అధ్యయనాధ్యాపనాల ఫలితంగా ఆ భాషల వైభవం కూడా వారికి లభించింది. ఆ విధంగా ఇంచుమించు ఒకనాటి మహాపండితుడు నారాయణభట్టులాగా అష్టభాషావిశారదులుగా గుర్తింపదగిన గొప్పవ్యక్తి శ్రీ శాస్త్రిగారు. మరొక్క విషయాన్ని కూడా ఇక్కడ తప్పనిసరిగా ప్రస్తావించాలి. మా గురువుగారి జ్యేష్ఠ కుమారుడు చి॥ రామకృష్ణ ఆంగ్లభాషలో పిహెచ్.డి. పట్టం పుచ్చుకున్నవాడు. కళాశాలలో ఆంగ్లభాషా సాహిత్యబోధనలతో రాణించినవాడు. రెండవ కుమారుడు చి॥ వెంకట రమణ రసాయనశాస్త్రంలో పరిణతి చెంది విదేశాలలో తన ప్రతిభను ప్రదర్శిస్తున్నవాడు. మూడవ కుమారుడు చి॥ సూర్యనారాయణ సంస్కృతంలో పిహెచ్.డి. చేసి ఆ భాషా సాహిత్యగౌరవాలను ప్రపంచానికి తెలియజేస్తున్నవాడు. మాష్టారి అనుంగుబిడ్డ శ్రీమతి విజయలక్ష్మి మళ్ళీ ఆంగ్లసాహిత్యంలో సమున్నతమైన పట్టాను అందుకొని చెన్నై నగరంలో భగవద్గీత మొదలైన ఆర్షగ్రంథాలను జిజ్ఞాసువులకు ప్రతిఫలాపేక్షలేకుండా ప్రవచనం చేస్తున్న ఉత్తమ గృహిణి అయిన విదుషీమణి. అంతేకాదు శ్రీ శాస్త్రిగారి జీవిత సహధర్మచారిణి శ్రీమతి సరస్వతమ్మగారు అత్యుదాత్తమైన పాండిత్యంగల విజ్ఞానవతి. ఆమెతో నాలుగు నిమిషాలు మాటాడితే సంస్కృత వాఙ్మయ శ్లోకాలెన్నో పరువెత్తుకుంటూ వెలుపలికి వస్తాయి. శ్రోతలను మంత్రముగ్ధులను చేస్తాయి. భగవంతుడు ఎంత మనోజ్ఞమైన కూర్పు చేశాడో మనం గమనించాలి. ఎందుకు అంటే ఆ గమనిక ఇతరులకు ఉద్బోధకం అవుతుంది.

*****

# విద్యావారసత్వాలు - ఆచార్య కోరాడ మహాదేవశాస్త్రి

**డా॥ కోలవెన్ను మలయవాసిని**

**ఫోన్ : 0891-2530289**

తాళ్ళపాక అన్నమాచార్యుల వారికి పెద తిరుమలాచార్యులు, గిడుగు రామమూర్తి పంతులుగారికి సీతాపతిగారు లాగ, ఆచార్య కోరాడ రామకృష్ణయ్యగారికి మహాదేవశాస్త్రిగారు విద్యావారసత్వులయిన పుత్రులు. భాషా సారస్వత ప్రజ్ఞానిధులు కోరాడ రామకృష్ణయ్యగారు. 'అచట పుట్టిన చిగురు కొమ్మైన చేవ' అన్నట్లు ఆ ఇంట పుట్టిన మహాదేవశాస్త్రిగారు భాషాసారస్వతాలను ఆబాల్యంగా వంటపట్టించుకున్నారు.

తండ్రిగారిలా భాషాసారస్వతాల్లోనే కాదు, ఆర్థిక శాస్త్రంలోనూ, చరిత్ర విషయంలోనూ కూడా పట్టభద్రులైన శాస్త్రిగారు బహువిషయ పరిజ్ఞాననిరతులు.

నలభై సంవత్సరాల వయస్సులోనే కలకత్తా విశ్వవిద్యాలయం నుండి డి.లిట్. పట్టాను పొందిన తొలి తెలుగు ఆచార్యులు కావడం విశేషం. 1921లో జన్మించిన శాస్త్రిగారికి 1961లో డి.లిట్ పట్టా లభించింది.

ప్రపంచ ప్రసిద్ధికెక్కిన ఆచార్య సునీతికుమార్ ఛటర్జీగారి పర్యవేక్షణలో వీరు సిద్ధాంత గ్రంథాన్ని రూపొందించడం ఒక విశేషమయితే, ఆ సిద్ధాంత గ్రంథానికి ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయ ఆచార్యులు 'బర్రో' గారు పరిచయ వాక్యాలు వ్రాసి ప్రశంసించడం వారి ప్రతిభా పాండిత్యాలకు గీటురాయి. ఆ సిద్ధాంత విషయాన్ని - 'ఎ హిస్టారికల్ గ్రామర్ ఆఫ్ తెలుగు' అనే పేర ప్రచురించారు.

పరిశోధనారంగంలో మహాదేవశాస్త్రిగారి దృష్టి విలక్షణ లక్షితమైంది. కలకత్తా విశ్వవిద్యాలయంలో శాస్త్రిగారు డిపార్ట్‌మెంట్ ఆఫ్ కంపారిటివ్ ఫైలాలజీలో విద్యార్థిగా చేరారు. ద్రవిడియన్ ఫైలాలజీ ప్రధానాంశంగా ఎమ్.ఏ. పట్టభద్రులయ్యారు. సువర్ణపతకం గెలుచుకున్నారు. ఆ ఎమ్.ఏ. చదివే రోజుల్లోనే కాశీపట్టణపు పరిసర ప్రాంతంలోని జాన్‌పూర్, సోనేపూర్ ప్రాంతపు గ్రామీణ జనజీవితం మీద పరిశోధన చేసి, వారి భాషా వ్యవహారాలను సూక్ష్మంగా అధ్యయనం చేసి 'ఎ గ్రామర్ ఆఫ్ వెస్టర్న్ భోజ్‌పురి' అనే పుస్తకాన్ని వ్రాసారు. ఈ రచనను కొలంబియా యూనివర్శిటీవారు ప్రచురించారు.

వీరికిగల భాషాశాస్త్రపరిజ్ఞానంతో వీరు చిదంబరంలోని అన్నామలై విశ్వవిద్యాలయంలో లింగ్విస్టిక్స్ శాఖలో ఉపన్యాసకులుగా పనిచేశారు. ఆ తరువాత తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిదాలయంలో అధ్యాపకత్వాన్ని చేపట్టి ఉత్తమ ఉపాధ్యాయులుగా పేరు పొందారు.

జర్మనీలోని కొలోన్ విశ్వవిద్యాలయంలో రెండు సంవత్సరాలు అక్కడి విద్యార్థులకు తెలుగు బోధించారు. ఐరోపావాసులు తెలుగు సులువుగా నేర్చుకునే విధంగా 'డిస్క్రిప్టివ్ గ్రామర్ అండ్ ఏ హ్యాండ్ బుక్ ఆఫ్ మోడర్న్ తెలుగు' అనే మంచి వాచకపుస్తకం తయారుచేశారు. విదేశీయులకు తెలుగు నేర్పే ఉపాధ్యాయులకు ఈ పుస్తకం మార్గదర్శకంగా ఉంది.

మన భాషకు ప్రధానంగా ఉన్న వ్యాకరణాలు రెండు, ఒకటి బాలవ్యాకరణం, రెండోది ప్రౌఢవ్యాకరణం. వ్యాకరణం చెప్పే విధానానికి, భాషాశాస్త్ర దృక్పథానికి చాలా తేడా ఉంది. విద్యార్థులు ఈ రెండు విధానాలను సమన్వయం చేసుకోవడంలో కష్టపడేవారు. ఈ పరిస్థితిని గమనించిన శాస్త్రిగారు - ఈ రెండు మార్గాలను సమన్వయపరుస్తూ విద్యార్థులకు సుబోధకంగా ఉండే రీతిలో 'వ్యాకరణ దీపిక' అనే చక్కని రచన చేశారు. భాషాశాస్త్ర వ్యాకరణశాస్త్ర విషయాలలో శాస్త్రిగారి కృషి విశేషాలివి.

శాస్త్రిగారికి భాషపై ఎంత మక్కువో, సాహిత్యంపట్ల కూడా అంతటి మక్కువ. ప్రాచీన కావ్యాలలో ఒకటయిన 'నన్నెచోడుని కుమార సంభవ' కావ్యానికి, సంపాదకులుగా విస్తృతమైన, విశిష్టమైన పీఠిక వ్రాసారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు దీన్ని ప్రచురించారు.

తెలుగుభాషను అధ్యయనం చేయడానికే కాదు, తెలుగు సాహిత్యాన్ని అర్థం చేసుకోవడానికి వీలుగా

శాస్త్రిగారు, 'ఆంధ్రవాఙ్మయ పరిచయం' అనే ఒక పుస్తకం సంక్షిప్త సుందరంగా వ్రాసారు.

ఈ పుస్తకానికి ముందు మాట వ్రాసిన శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు "ఆంధ్రవాఙ్మయ చరిత్రలు ఆంధ్రాంగ్లాలలో ఇప్పటికి చాలా వెలసినవి. వాఙ్మయ చరిత్ర, దేశ చరిత్ర సమన్వయించి సూత్రప్రాయముగా మనోవికాసం కలిగించుచూ....సూక్ష్మములో మోక్షము అన్నట్టు సులభ రచన ఇంతవరకు లేదు" అంటారు.

ఆచార్య మహాదేవశాస్త్రిగారు 1990 సంవత్సరంలో మా విశాఖపట్టణంలో కెమిస్ట్రీ ఆచార్యులు సోమిదేవమ్మగారి ఇంట్లో ఏర్పాటు చేసిన సభలో 'ద్రావిడ భాషల విలక్షణత' గురించి విశేషమైన ఉపన్యాసం చేసారు. ద్రావిడ భాషలన్నింటిలోనూ 'చిన్నది' అని చెప్పే సందర్భంలో పదానికి చివర ఇకారం వస్తుంది అని ఉదాహరణలతో నిరూపించారు. చిన్ని, పిన్ని, కున్ని, చిట్టి, పొట్టి మొదలైనవి. వీరి దేశ్యపదవ్యుత్పత్తి పదకోశాన్ని – 'తెలుగు దేశ్యవ్యుత్పత్తి నిఘంటువు'గా ద్రావిడ విశ్వవిద్యాలయం, కుప్పంవారు 2003లో ముద్రించారు. ఆచార్య కోరాడ మహాదేవశాస్త్రిగారి భాషాశాస్త్రపరిజ్ఞాన సర్వస్వంగా ఈ నిఘంటువును పరిగణించవలసి ఉంది.

ఇలా ఇరవయ్యో శతాబ్దిలో భాషా, సాహిత్య రంగాలు రెండింటిలో విశేషకృషి చేసి ఖండాంతర కీర్తినార్జించిన 'భాషా పరిశోధకాగ్రగణ్యులు, భాషా పరశేషులు' అయిన ఆచార్య కోరాడ మహాదేవశాస్త్రిగారికి గావించే అక్షరార్చనలో నాకూ అవకాశం కల్పించిన డా॥ రామకృష్ణ గారికి ధన్యవాదములు.

*****

## తెలుగు భాషా సంస్కృతుల చేదివ్వెను దేదీప్యమానం చేసిన భాషావేత్త

# ఆచార్య కోరాడ మహాదేవశాస్త్రి

**శ్రీ గుత్తికొండ సుబ్బారావు,** సెల్ : 9440167697

**డా॥ జి.వి. పూర్ణచందు,** సెల్ : 9440172642

కృష్ణా జిల్లా రచయితల సంఘం

భాషాశాస్త్రం అనేది ఒక సాధనతో కూడిన సుదీర్ఘశ్రమ, పారమైన మేథాసంపత్తి, జ్ఞాపకశక్తి, బుద్ధి, ధీ, విచక్షణాశక్తులతో కూడుకున్న విద్య అది ! భాషా పండితులంతా భాషావేత్తలు కాలేరు. భాషావేత్త కాగలవారిని మించిన శాస్త్రవేత్త లేడు.

శబ్దమూ-అర్థమూ అనే రెండు స్తంభాలమీద వెలిసిన ఒక మహాసౌధం భాషాశాస్త్రం. మనిషి చుట్టూ అల్లుకున్న ఒక కాంతి వలయం భాషాశాస్త్రం. మానవుడి ఉనికిని, అతని పుట్టుకని, అతను ధ్వనులను వెలువరించేందుకు సహకరించే అతని అవయవ ప్రత్యవయవాల తీరునీ, అతను పలికిన శబ్దాలు అక్షరాలై, ఆ అక్షరాలు మాటలై, ఆ మాటలు వాక్యాలై, మహావాక్యాలై వేదకాలం నుండి అణువాద కాలం దాకా సాగిన అనంత కాలగమనాన్ని విశ్లేషించగలిగే ఏకైక శాస్త్రం భాషాశాస్త్రం.

భాషాశాస్త్రం అంటే భౌతిక, తాత్విక, ఆధ్యాత్మిక అంశాల సమ్మిశ్రితం కూడా! దాని అధ్యయనం సమస్త దర్శనాల అధ్యయనమే! అందుకే భాషావేత్త అధిక పరిశ్రమతో కూడిన భారాన్ని వహించవలసి వస్తుంది.

కోరాడ రామచంద్రశాస్త్రిగారు, వారి మనుమడు కోరాడ రామకృష్ణయ్య పంతులుగారు, వారి కుమారుడు కోరాడ మహాదేవశాస్త్రిగారు, తెలుగు భాషాశాస్త్ర సౌధ నిర్మాతలు. అంతటి పరిశ్రమను చేసిన యోగిపుంగవులు.

తెలుగు భాషాధ్యయనంలో పాశ్చాత్య విమర్శనా రీతులను ప్రవేశపెట్టి, దానిని ఒక శాస్త్రంగా రూపొందింప చేయటంలో రామకృష్ణయ్య పంతులుగారి సేవ అపురూపం. కాగా, తండ్రిని మించిన తనయులుగా వాసికెక్కినవారు మహాదేవశాస్త్రిగారు. ఆయన సునీతికుమార్ ఛటర్జీగారి వద్ద శిష్యరికం చేసి ద్రావిడ భాష వ్యాకరణాల మీద తులనాత్మక అధ్యయనం ద్వారా, ద్రావిడభాషల మూలాలను, తెలుగు భాష ప్రాచీనతను లోకానికి చాటిన గొప్ప భాషావేత్త.

తమిళభాష ప్రాచీనత కోసం కృషిచేస్తున్న ఐరావతం మహదేవన్‌గారు కోరాడ మహాదేవశాస్త్రిగారి 'హిస్టారికల్ గ్రామర్ ఆఫ్ తెలుగు' గ్రంథాన్ని ఆధారం చేసుకుని సింధునాగరికత కాలానికే ద్రావిడ ప్రజలు ఉన్నారని, వారిలో తెలుగువారు కూడా ఉన్నారనే ఒక ఊహాత్మక పరిశోధనాంశాన్ని వెల్లడించారు. మహాదేవశాస్త్రిగారి అద్భుత భాషాకృషికి ఇది ఒక కలికితురాయిగా పండితులు భావిస్తారు.

కృష్ణాజిల్లా రచయితల సంఘం మండలి వెంకట కృష్ణారావుగారి పేరుతో నెలకొల్పిన భాషా పురస్కారం మహాదేవశాస్త్రిగారికి ఇచ్చి గౌరవించుకొనే అవకాశం మాకు కలిగింది. ఆ సందర్భంగా వారి కుటుంబం యావత్తూ మా సభకు తరలివచ్చారు. అందరితోనూ మాకు గాఢమైన పరిచయాలు ఏర్పడ్డాయి.

తండ్రిపట్ల గురుభావం, భక్తీ కలిగిన సంతతిని కన్న మహాదేవశాస్త్రిగారు ఎంతో అదృష్టవంతులు. ఆ మహనీయుని తండ్రిగా పొందినందుకు వారి పుత్రులు, పుత్రిక జన్మ ధన్యం. ఎంతో పుణ్యవశాన ఆ అవకాశం వారికి లభించింది.

తండ్రినీ, వారి భాషా సేవలను మరువకుండా ఒక ఆరాధనాభావంతో మహాదేవశాస్త్రిగారి స్మృతుల్ని పదిలపరుస్తున్నందుకు కోరాడ రామకృష్ణగారినీ, వారి సోదరులను, సోదరిని మనసారా అభినందిస్తున్నాము.

భాషాశాస్త్రవేత్తకి మాతృభాషాభిమానం ముఖ్యం. అది లేకుండా భాషను ఎంత అధ్యయనం చేసినా మాతృభాషకు చేకూరే ప్రయోజనం ఉండదు. కోరాడ వంశీకులంతా 'అమ్మనుడి'ని తలకెత్తుకుని, దాని వ్యాప్తికి, దాని ప్రాచీనతా నిరూపణకు, దానిలోని శాస్త్రీయత నిరూపణకూ చేసిన కృషి అమోఘమైనది. తెలుగుజాతి వారికి ఎంతైనా ఋణపడి ఉంది.

తెలుగుభాషా సంస్కృతుల చేదివ్వెను దేదీప్యమానం చేసిన భాషావేత్త ఆచార్య కోరాడ మహాదేవశాస్త్రిగారికి ఇదే మా నివాళి.

*****

# నాన్నగారు...



మద్రాసులో విద్యార్థిగా



కలకత్తాలో విద్యార్థిగా



యస్.వి. యూనివర్శిటీలో
అధ్యాపకునిగా



జర్మనీలో
ఆచార్యులుగా



అన్నామలై యూనివర్శిటి
భాషాశాస్త్ర విభాగంలో



యస్.వి. యూనివర్శిటీ
తెలుగు శాఖలో



అనంతపురం పి.జి. సెంటర్ (తెలుగు శాఖ)
మొదటి బ్యాచ్ విద్యార్థులతో




కొలోన్ యూనివర్శిటీ (జర్మనీ)
విజిటింగ్ ప్రొఫెసర్‌గా









## Sri Annamacharya Project of North America (SAPNA)

**Founded 1989 - Regd. 1993**

**3042, Carmel Drive, Flossmoor IL 60422, USA**

**Confers the title**

# *"SRIKALA PURNA"*

For research par excellence, and exceptional contributions made in the field of Literary and language traditions of India.

to

## Prof. Dr. Mahadeva Sastry Korada, India

A Linguist, a Philologist, a distinguished Professor, and a Published Author,

during "తెలుగు సంస్కృతి - భాషా సారస్వతములు"

**ESSAYS IN HONOR OF**

**Prof. KORADA MAHADEVA SASTRY**

A Living Legend in Linguistics and Philology

**Book Release - 2013**

*Founder, Chairman*

**Dr. Sriram Sonty M.D.**

*Founder, Executive Director*

**Dr. Sarada Purna Sonty Ph.D.**

Ananthapur, Andhra Pradesh, India

Sri Vijaya Nama Samvatsaram - July 6, 2013

Sri Annamacharya Project of North America

Celebrating 25 years of Service to Performing Art Traditions of India in USA

# తెలుగు దేశ్యవ్యుత్పత్తి నిఘంటువు

డా॥ ద్వా.నా.శాస్త్రి

సెల్ : 9849293376

తెలుగులో చాలా నిఘంటువులు వచ్చాయి. అవన్నీ ఎక్కువగా సంస్కృతపదాలకు సంబంధించినవే. తెలుగు భాషకు సరైన నిఘంటునిర్మాణం కోసం 'కవిగారు'గా పేరొందిన మారేపల్లి రామచంద్రశాస్త్రి కొంత కూర్చారు కానీ అలభ్యం. అచ్చ తెలుగు నిఘంటువులు వచ్చినా దేశీయమైన తెలుగుకి అంతగా ప్రయోజనం లేనివి. ఈ నేపథ్యంలో ఆచార్య కోరాడ మహాదేవశాస్త్రిగారు 'తెలుగు దేశ్యవ్యుత్పత్తి నిఘంటువు' నిర్మించారు. "ద్రవిడవ్యుత్పత్తి కోశం" అనేక సంపుటాలతో విస్తారంగా రూపొందించబడటంవల్ల పరిశోధకులకే పరిమితమైంది.

"ఈ పుస్తకం సామాన్య విద్యార్థులకి ఉద్దేశింపబడింది కనుక సజాతీయపదాలను విపులంగా ఇచ్చే ప్రయత్నం చేయలేదు. చాలా వరకు మూలధాతు పునర్నిర్మిత రూపాలను చూపాము. శబ్దవ్యుత్పత్తి తెలియడంవలన పాఠకునకు శబ్దార్థ సంబంధం మీద అవసరమైన పట్టు చక్కగా చిక్కుతుంది" అంటూ మహాదేవశాస్త్రి తమ లక్ష్యాన్ని, ప్రణాళికను స్పష్టీకరించారు. ఈ నిఘంటునిర్మాణంలో డా. ఇరిగేపల్లి ముద్దప్ప సహాయసంపాదకులుగా ఉన్నారు.

ద్రవిడ విశ్వవిద్యాలయం ఈ నిఘంటువును 2003వ సంవత్సరంలో ముద్రించింది. అయితే దీని ప్రతులు తమ వద్దే ఉంచుకుంది తప్ప వివిధ పుస్తకశాలలకి పంపలేదు. సరైన సమీక్షలూ చేయించలేదు. వెలుగు చూడకపోవటంవల్ల మహాదేవశాస్త్రిగారి భాషాకృషి మరుగునపడింది. నేనొక వ్యాసం రాసిన పిమ్మట కొంత కదలిక వచ్చింది.

ఈ నిఘంటువులోని కొన్ని పదాలను పరిశీలించండి.

అప్ప : అక్క, జ్యేష్ఠ సోదరి ; తల్లి, తండ్రి నామాలకు అను ప్రయుక్తం. ఉదా: నేతప్ప, కన్నప్ప కనడం (అప్పు), తమిళం (అప్పన్)

అప్పచ్చి : భక్ష్యం, అప్పం (కన్న-అప్ప= బియ్యపు రొట్టె (బాలభాష) తమిళం అప్పమ్ = తీపిరొట్టె, తీపి తినుబండారం.

కుక్కి : లోతైనది, తాళ్ళు వదులై పల్లంపడినది - కుక్కి మంచం.

చిలుక, చిలుకు : కన్నడం తుళు - గిళి ; తమిళం, మలయాళం - కిళి ; పర్జి - కివ్ ; కళ్ బహువచన ప్రత్యయంతో కూడిన ప్రాచీన శబ్దం యొక్క అనుచిత విభాగం.

కిళి + కళ్ = చిలుకలు

మాండలికంలో చిలుకు - గొళ్ళెం ; తాళం వేయడానికి వీలుగా అమర్చిన పరికరం.

చిలుకు పెట్టు = గొళ్ళెంపెట్టు, తాళం వేయు.

లొట్ట : రుచ్యాలైన పదార్థాలు తిన్నప్పుడు, నాలుక అంగిట చేర్చి చేసే ధ్వని. లొట్టవేయు.

ఈ విధంగా దేశ్యపదాల గుట్టును చాలా వరకు ఎరుకపరిచారు. ద్రవిడవ్యుత్పత్తి పదకోశం నుంచి వివరణలు స్వీకరించారు. దాదాపు మూడువేల దేశీయపదాలు ఇందులో కనబడతాయి. సంస్కృతపదాలకు అర్థాలు చెప్పటం, శబ్దనిరూపణ చేయటం మనకి అలవాటయింది. చాలా మంది సంస్కృత విద్వాంసులు తెలుగుకి పదస్వరూప నిరూపణమేమిటి అని ఎద్దేవా చేస్తారు. అటువంటి వారు దీనిని అధ్యయనం చెయ్యాలి. ద్రవిడ విశ్వవిద్యాలయం ఈ నిఘంటువుకి ప్రాచుర్యం కల్పిస్తే మహాదేవశాస్త్రిగారి కృషి కొంత సఫలమవుతుంది. లేదా ఒక ప్రచురణ సంస్థకి అప్పజెబితే ఇంకాస్త అందుబాటులోకి వస్తుంది. తెలుగు అధ్యాపకుడు సంస్కృతపదాలకు తప్ప తెలుగుపదాలకు సరైన వివరణలు ఇవ్వలేకపోతున్నాడు. వాళ్ళకిది సంప్రదింపు గ్రంథంగా ఉపకరిస్తుంది. అందుకే కోరాడ మహాదేవశాస్త్రి ముందు మాటలో ఇలా అన్నారు "ఈ పుస్తకాన్ని ఒక రెఫరెన్స్ నిఘంటువుగా కాక అధ్యయనానికి ఆధార గ్రంథంగా చదవటం ఎక్కువ ప్రయోజనకం" తెలుగు భాషాధ్యయనశీలురకు ఎంతో సహకారి. తెలుగు భాషా పరిరక్షణలో ఈ నిఘంటువు ముఖ్యపాత్ర వహించేలా రూపొందించిన మహాదేవశాస్త్రిగారు స్మరణీయులు.

*****

# సంస్కృతి

**డా॥ శొంఠి శారదాపూర్ణ**

సెల్ : 001-708 957 4302

"కోరాడ" వంశం అనగానే స్ఫురణకి వచ్చే విశిష్టమైన సారస్వతవిషయాల్లో మొదటిది 'మంజరీ మధుకరీయం' పేర వెలసిన 'ప్రప్రథమ తెలుగు నాటక' ప్రక్రియ. రెండవది 'సంధి - సమాసం - ద్రావిడభాష క్రమ విలాసనం'. మూడవది 'తెలుగు శాసనాలు, భాషా పరిణామం, ద్రావిడభాషాపదనిర్మాణం సిద్ధాంతాలు'. నాల్గవ అంశం 'వేదాక్షర స్వరూపం ఈనాటి దృక్పథం', 'సంస్కృత భాష వైజ్ఞానిక సాంకేతిక ప్రభావం', 'అర్వాచీన ప్రపంచ భాషాసంప్రదాయాలు'. భాషా సారస్వతాంశ పరిశోధనల అంశాలని, కోరాడ భాషావేత్తలని ప్రస్తుతించిన వారిలో KL Janert - Director of Indology University of Cologne West Germany, T Burrow, Boden Professor of Sanskrit University of Oxford UK, Suniti Kumar Chatterji and Sukumar Sen, Professors of Comparative Philology Calcutta from yester years ముఖ్యులు.

భాషాపరిశోధన, సాహిత్యవిశ్లేషణ అన్న అంశాలు రెండూ అతి సంశ్లిష్ట ప్రవృత్తి కల్గిన సారస్వత అంశాలు - భారత దేశభాషల విస్తృతి, ఘనత ఐదు అంశాలని ప్రపంచానికి అందించాయనటం అతిశయోక్తి కాదు. 1. సారస్వత తత్త్వాన్వేషణం Literary Scholarship, 2. పరిశీలనాత్మక సారస్వతాధ్యయనం Literary Comprehensive Study, 3. సాహిత్య లక్ష్యలక్షణ వివేచనం Study of basic and applied sciences of Literature, 4. కావ్యదర్శన మీమాంస Literary Critical theories, 5. సారస్వతానుశీలన మార్గాలు, అనుసరణ - Literary critical paths.

భాషాపరిశోధన విషయంలో ప్రపంచభాషలలో ఏ భాషకైనా ఈ విషయాలు అంతర్నిహితంగా ఉండక తప్పదు. కొన్ని పరిమితులు వలన స్పష్టంగా ప్రతిపత్తి వ్యక్తం కాకపోవచ్చు. పరిశోధన ఏ విధంగా సాగినా ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదించాలనేది ఈ కాలపు విమర్శకుల మాట. ఇది పాశ్చాత్యుల ఆలోచనా ప్రభావంవలన అనుసరిస్తున్న సిద్ధాంతం. పరిశోధన అనే ప్రక్రియ ఆలోచన అన్వేషణల ఫలం. శాస్త్రీయమైన పద్ధతిలో సాధించిన దార్శనిక సత్యాల రూపాన్ని అక్షరబద్ధం చేసి సిద్ధాంతాన్ని రూపొందించి ఆవిష్కరించటం సాహిత్య పరిశోధనలో పరమార్థం. పరిశోధనాత్మక సారస్వత సిద్ధాంతాలు కావ్యానుశీలనంలో వినూత్న పరిశీలనా విధానం తెలియ చేస్తాయి. ప్రత్యేకమైన దృక్పథాలని కలిగిస్తాయి. వివేచనా శక్తిని పెంచుతాయి. సముచితమైన సారస్వతవిలువలని అందిస్తాయి. నియమాలని, నిబద్ధతని స్పష్టం చేస్తాయి, రససిద్ధినందిస్తాయి.

తరతరాలుగా భాషాసారస్వతాలకి అంకితమైన వంశాలలో 'కోరాడ' వంశం ఒకటి. కోరాడ వంశీయులు 1800 నుండి 2017 వరకు ఈ సారస్వతవిషయాలలో పరిశోధన సాగిస్తూనే ఉన్నారు. లోతులు చూస్తున్నారు. శాస్త్ర, సిద్ధాంత, విమర్శనాత్మక, విశ్లేషణాపూర్వక, వివరణలు ప్రపంచానికి అందిస్తూనే ఉన్నారు. వేదవాఙ్మయ అవగాహనా విధానం, సంస్కృతవ్యాకరణ, ప్రాకృత భాషలు, ప్రాచీనాంధ్ర భాషా స్వరూపం, ద్రావిడభాషానిర్మాణవైఖరులు, మాండలిక ప్రాంతీయ దేశి భాషావిలాసనం, శాసనభాష, ఇలా అనేకాంశాల పరిశోధన సాగించి సిద్ధాంత పూర్వక విషయాలనందించారు. విమర్శనాపూర్వకంగా గ్రంథస్థ, వ్యావహారిక భాషల, మాండలీకాల, తెలుగు భాషాధ్యయనం 1820లో ఇంగ్లాండ్ నుంచి వచ్చి తెలుగు దేశభాషల్లో ఒక క్రొత్త ఉద్యమం తెచ్చి తెలుగు భాషా సాహిత్యోద్ధారకునిగా పేరు పొందిన Charles Phillip Brownతో ఆరంభం అయింది. అంతే కాదు "In 1925 I found Telugu Literature dead. In 30 Years I raised it to Life" అని ధైర్యంగా ప్రకటన చేశాడు. Caldwell తులనాత్మక విధానాలని ప్రవేశపెట్టి సంధించాడు. గిడుగు రామ్మూర్తిగారి పరిశ్రమ వలన ప్రజల్లో

భాషాపరిజ్ఞానం వ్యాపించటంతో శిష్ట వ్యావహారికభాష, వ్యావహారిక తెలుగు వెలుగులోకి వచ్చాయి. ఈ ప్రయత్నాన్ని చిలుకూరి నారాయణగారు విస్తృతంగా వ్యాసాల రూపంలో వెలయించారు. కోరాడ రామకృష్ణయ్యగారు తెలుగు వ్యాకరణం, పదాల నిర్మాణం, సందులు, సమాసాలు, అక్షర రూప వికల్పాలు, అన్యదేశ్యాలు, భాషాపరిణామశీలత, ప్రాచీనాంధ్ర కవుల సారస్వత విశేషాలు, వంటి అంశాలనెన్నింటినో అనుశీలనాత్మక చర్చల్లోకి తెచ్చి తెలుగు భాషాశాస్త్ర విస్తీర్ణతని లోతుల్ని వెలుగులోకి తెచ్చారు. గంటి జోగి సోమయాజిగారు తెలుగు మాండలీకాల్లో ప్రామాణిక పరిశోధనా గౌరవాన్ని పెంపుచేశారు.

కోరాడ మహాదేవశాస్త్రిగారి భాషా వ్యవసాయం తెలుగు శాసనాలలో భాష, ద్రావిడభాషల పదాల్లో పరిణామం, అన్యభాషల ప్రభావం, తెలుగు ప్రయోగశీలత్వం, మాండలీకాలు, పదాల నిర్మాణం, వాడకంలో ఎదురయ్యే సమస్యలు, పరిష్కార విధానాలు, తెలుగులిపి, పరిణామాలు, లిపి సంస్కరణ పద్ధతులు, వంటి అత్యంత ప్రయోజనకరమైన, అవసరమైన విద్యా అంశాలు తెలుగు వారికి అందాయి. మహాదేవశాస్త్రిగారు విఖ్యాత ఆచార్య సునీతి ఛటర్జీగారి దగ్గర పరిశోధన చేసి 1965లో “The Historical Grammar of Telugu'' సిద్ధాంత వ్యాసం అందించి, D.Litt. పట్టా అందుకున్నారు. జర్మనీలో భాషాశాస్త్ర ఆచార్యులుగా వ్యవహరించి “Descriptive Grammar and Hand Book of Modern Telugu'' రచించారు. వీరు వ్రాసిన అనేక పరిశోధక పత్రాలలో కొన్నింటిని మాత్రం ఇక్కడ ఉదాహరిస్తున్నాను. 'A folk tale in Western Bhojpuri (1954)', 'Intensive and Inclusive compounds in Telugu (1954)', 'Dialectical variations in 11th Century Telugu (1957)', 'Prakrit Inscriptions in Andhra (1960)', 'Vedic and Classical Sanskrit (1965)' మొదలగునవి. వీటితోపాటు ‘ఆంధ్రవాఙ్మయ పరిచయం’, ‘వ్యాకరణ దీపిక’, ‘తెలుగు దేశ్యవ్యుత్పత్తి నిఘంటువు’, ‘భాషా-సంస్కృతి’ మొదలగు గ్రంథాలు రచించారు. ఈ రచనల్లో అపూర్వమైన విషయాలను, భిన్న భిన్న అంశాలను పొందుపరిచారు.

మహాదేవశాస్త్రిగారు తన 93వ ఏట ప్రచురించిన ‘భాష సంస్కృతి’ అన్న గ్రంథం వీరిని తెలుగు భాషా, సారస్వత రంగాలలో అత్యున్నత భాషావేత్తగా నిరూపిస్తుంది. తెలుగు భాషా రంగంలో చిరస్థాయిగా నిలచే వైతాళికుడు ఈయన. అసిధారావ్రతంగా పరిశోధన చేసి తెలుగుభాషకి అజరామరమైన సేవ చేశారు. వీరి ప్రజ్ఞాభిజ్ఞత, వైదుష్యం గణనీయమైనవి.

మన దేశంలో ఆర్యుల సంస్కృతీ భాషావిలాసనం గురించిన అధ్యయనం కోసం జరిగిన యుగ విభజన – ప్రాచీన హింద్వార్య భాష (Old Indo Aryan - OIA)
మధ్య హింద్వార్య భాష (Middle Indo Aryan - MIA)
ఆధునిక హింద్వార్య భాష (New Indo Aryan - MIA)
సిద్ధాంతాల కనుగుణంగా భాషాపరిణామం దృష్టిలో పెట్టుకుని విశిష్టమైన అంశాలని వెల్లడించారు.

ఆర్యభాషల మీద అనార్యభాషా ప్రభావాలు, సంస్కృతంలో ద్రావిడ ప్రతిదేయపదాలు, ప్రాచీన మధ్యయుగ శాసనపదావళి, వైకృతపదావళి, విభక్తి పల్లటము, అర్థసందిగ్ధతకు పరిష్కారం, తెలుగు భాషా ధ్వనులు ప్రధాన లక్షణాలు, ధ్వని మార్పు, అర్థ పరిణామం, తెలుగులో మణిప్రవాళశైలి, సంధిలో చారిత్రిక అవశేషాలు, వంటి అపూర్వమైన వ్యాసాలు ప్రకటన చేశారు.

“శబ్ద ప్రతీకము” (భాష – సంస్కృతి పేజి. 88) అన్న వ్యాసం తులనాత్మక పరిశోధనలకు ఆధారం కాగలదు. శాకపూణి, కాత్యాయనుడు, శౌనకుడు, ఉవ్వటుడు, భట్ట భాస్కరుడు, కృష్ణసూరి, సాయణుడు మున్నగు వేద భాష్యకారులు, నిరుక్తకారులు వేదాక్షరవాదానికి మార్గం ఏర్పాటు చేశారు. అక్షర దృష్టితో సర్వ సృష్టినీ శబ్దబ్రహ్మాన్ని నిర్వచించారు. అక్షరార్థమే సృష్టికారకమని ప్రకటించారు. అక్షరం విషయంలో ఆధునిక భాషావేత్తల పరిశోధనలు ఆసక్తికరం. అర్థస్ఫురణ కలిగించే ధ్వనుల వలన ఏర్పడుతున్న తెలుగుభాషాపదాల నిర్మాణవైఖరి భాషాపరిశోధనలని క్రొత్త మార్గంలో నడిపించే అవకాశం ఉంది.

హ కారం – అర్థాతిశయం, ఇ కారం – ఆధారం ప్రేమ, సమీపార్థకం, న వ స మా అక్షరాలూ – సౌకుమార్యం, కోమలత్వం, మూర్ధన్య పరుపాక్షరం – దుష్టత్వం, ఒ ఓ కారం – వక్రత, కుటిలత్వం, ఐ కారం – బోలుగా ఉండటం, ఉబ్బి ఉండటం, జ కారం – చిక్కదనం జిగట, ర కారం – గుండ్రంగా ఉండటం, స కారం – శబ్దం లేని కదలిక, అనుస్వారం – నిండు తనం ఇలా అక్షరార్థం తెలియచేసే విధానం పరిశోధనకు విషయం కాగలదు.

ఒకనాడు వ్యక్తుల చర్చల్లో, సమావేశాల్లో, సభల్లో, పరిషత్తులో, వ్యాసరచనల్లో ఉన్న తెలుగు వ్యవహారభాష, స్వరూపం, వ్యాకరణం, సాహిత్యం ఈ రోజున సాహిత్య అకాడమీల్లో, పాఠశాలల్లో, విశ్వవిద్యాలయాల్లో పరిశోధనా రంగాల్లో, రాజకీయాల్లో, అంతర్జాతీయ వ్యాపార వ్యవహారాల్లో ప్రవేశం పొంది ఒక ప్రత్యేక స్థానం సంపాదించింది. ఈ విషయంలో కోరాడ వంశం అందించిన పరిశ్రమ విశిష్టం. ఆంధ్రదేశం దాటి కోరాడ వంశం శాఖోపశాఖలై ప్రపంచమంతా విస్తరించింది. ఒక బృహత్తర ప్రణాళిక ఈ వంశీయుల విద్యా వ్యవసాయంలో భాగం.

తెలుగు పరిశోధనాసక్తి ఉన్నవారు ఇంకొక ముఖ్యమైన విషయం గ్రహించాలి. దాదాపు మూడు దశాబ్దాల కాలం పూర్వం నుండి కోరాడ మహాదేవశాస్త్రిగారి వరకు తెలుగు భాషాశాస్త్రం "Philology"గా వ్యవహారంలో ప్రచారంలో ఉంది. ఆ తర్వాత “Telugu Linguistics” అని వ్యవహారంలోకి వచ్చింది. క్రమేణా భాషాశాస్త్రం “Telugu Linguistics”గా ప్రత్యేక స్థాయినీ, ప్రతిపత్తినీ సాధించింది. స్థిరపడింది. ఈ రోజున “Phiology” వాడుకలో లేదు. భాషాశాస్త్రం ప్రధానంగా వర్ణనాత్మకం – Descriptive Science, Structure, collection of words, script development, inscriptions, manuscripts, copper plates, palm leaves, వర్గీకరణ, విషయం విశ్లేషణ, సామానీకరణ, archaeological evidence, anthropological models అన్నీ అత్యవసరమే. అవగాహన కావాలి. బహువ్యవస్థల పరిశోధన కావాలి కోరాడవారి విద్యా వ్యవసాయం రామచంద్ర కవిగారితో ఆరంభమై, రామకృష్ణయ్యగారి కాలంలో విస్తరించి మహాదేవశాస్త్రిగారి నాటికి తెలుగు భాషాశాస్త్రం వినూత్న విశ్లేషణా విధానాలని, సమన్వయ పద్ధతులని ఉద్ఘాటించి, తర్వాతి తరాల వారి శ్రమ, సునిశిత భాషానైపుణ్యం పరిశోధనలతో ప్రతిపాదనలని చెయ్యగలుగుతోంది.

కోరాడ మహాదేవశాస్త్రిగారు తెలుగు శాసనాలు ఆధారంగా తెలుగు భాషా పరిణామాన్ని పరిశీలించి క్రొత్త విషయాలనీ పైకి తెచ్చారు. ఆధునిక భాషాశాస్త్ర నియమాలకు అనుగుణంగా, ఇప్పటి భాషాశాస్త్ర పద్ధతుల్లో తెలుగు చారిత్రిక వర్ణనాత్మక వ్యాకరణ సిద్ధాంతాలని ప్రతిపాదన చేశారు. వృత్తి పద కోశ నిర్మాణం చేసే గ్రంథం అందించారు. భాషా సామాజిక పరిశోధన శాస్త్రిగారి వ్యవసాయంలో ఒక వంట. మహాదేవశాస్త్రిగారు మహా మనీషులు. కీర్తిశేషులు తండ్రిగారు రామకృష్ణయ్యగారు, మానవల్లి రామకృష్ణ, వేదం వెంకటరాయశాస్త్రి, వేటూరి ప్రభాకరశాస్త్రి, చిలుకూరి నారాయణరావు, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారల దగ్గర భాషాశాస్త్రరహస్యాలని అధ్యయన పూర్వకంగా అందుకున్నారు. ప్రయోజనానికి రాని లిపి సంప్రదాయం పరిహరించటం, లాక్షణిక విరోధ పాఠాలు విడనాడటం, ప్రకరణ ఔచిత్యాన్ని గుర్తించటం, ఏకవాక్య, సుదీర్ఘవాక్యాలని సరళంగా వ్రాసే విధానాలు ముఖ్యమని గ్రహించి ప్రతిపాదించారు. ప్రాచీన శబ్దశాస్త్రం, నవీన భాషాశాస్త్రం వీరి అభిమాన దృక్పథాలు. తెలుగు భాష పరిజ్ఞానానికి పరవస్తు చిన్నయసూరి ‘బాల వ్యాకరణము’, లక్ష్యపరిజ్ఞానానికి బహుజనపల్లి సీతారామయ్యగారి ‘ప్రౌఢ వ్యాకరణము’, శాసనస్థలిపి, వీరి పరిశోధనకు మార్గదర్శకాలే అయినప్పటికీ భాష లక్ష్య లక్షణాల మధ్య ఉన్న “సామాన్య – సాపేక్ష సంబంధాన్ని” తెలిసి సాధించటం తన గమ్యంగా పెట్టుకున్నారు.

బూదరాజు రాధాకృష్ణ, యం. కందప్పచెట్టి, కెకె రంగనాథచార్యులు వంటి మహామహులు మహాదేవ శాస్త్రిగారు సాగించిన పరిశోధనా విధానాలలోనే ముందుకు సాగి ప్రతిపాదనలు చేశారు. ద్రావిడ భాషా తులనాత్మక పరిశీలన, భాషా నిర్మాణ విధానాలు ప్రతిపాదించిన భద్రిరాజు కృష్ణమూర్తి, తెలుగుభాష అర్థనిర్మాణసంబంధిత శాస్త్ర పరిశోధన చేసిన జి.ఎన్.రెడ్డి, తెలుగుభాషా అన్యదేశ పద పరిశోధన చేసిన

తూమాటి దోణప్ప, లకంసాని చక్రధరరావు, పరివర్తన సిద్ధాంత ధోరణిలో సాగి తెలుగు భాషాశైలి శాస్త్రనిర్మాణం చేసిన చేకూరి రామారావు, ద్రావిడభాషా క్రియాపదాల నిర్మాణం తులనాత్మక పరిశోధన చేసిన పి.ఎస్. సుబ్రమణ్యం, తెలుగుభాషాపదాలలో ఉన్న వ్యవస్థనీ, ఆ వ్యవస్థ ఏర్పడేందుకున్న సిద్ధాంతాలనీ వివరించిన వెన్నెలకంటి ప్రకాశం, అధికరణ సిద్ధాంతం – Localist తెలుగుభాషలో కనిపిస్తున్న విధానం చెప్పిన బి. రామకృష్ణారెడ్డి, ఉత్పాదక అర్థపరిణామ సిద్ధాంతం – generative semantics అనుసరించి పరిశోధన చేసిన కిలారి నాగప్రభాకరరావు, గ్రామాల పేర్ల మీద పరిశోధన చేసిన కేతు విశ్వనాథరెడ్డి వంటి విశిష్ట తెలుగు భాషావేత్తల భాషాశాస్త్ర దృష్టి, పరిశ్రమ తెలుగు భాషాస్థాయిని అంతర్జాతీయ చేస్తాయనటం నిర్వివాదాంశం.

కోరాడ కవుల, భాషావేత్తల భాషాప్రయోగ దృష్టి, శాస్త్ర అవగాహన ఇప్పటి వారికి స్ఫూర్తిదాయకమైంది. తర్వాతి తరాల వారికి మహాదేవశాస్త్రిగారి మార్గం దృక్పథం సుగమ మార్గం చూపాయి. తెలుగు నిఘంటువు నిర్మాణానికి, Desktop Learning of Telugu Language Primers కి, పదకోశాలకి, పరిశోధనాగ్రంథాల ఆవిష్కరణకి, అనువాదాలకి, కావ్య రచనలకి, పద్య రచనలకి, వేదాక్షర స్వరూప సంబంధిత వ్యాసమాల గ్రంథాలకు ఆధారమయ్యాయి. పద ప్రయోగ కోశాలు, మాండలీక వృత్తి పదకోశాలు, సంస్కృతకావ్య, నాటకాల తెనిగింపు, సారస్వత పరిశోధనా గ్రంథాలు, పద్య కావ్యాలు, తెలుగు బోధనాగ్రంథాలు తెలుగు రంగానికి అందుతున్నాయి. పరిణామదిశలో నడుస్తున్న ఈనాటి భాషా చైతన్యం పరిశోధనా సిద్ధాంతాలకీ, ప్రమాణాలకీ, చారిత్రక సమీక్షలకు, ప్రక్రియా విధానానికీ, శాస్త్రీయ దృష్టికీ, సింహావలోకనానికీ, సారస్వతావగాహనకీ సమాన గౌరవం ఇస్తూ నడిపిస్తూ ఉంది. అంతర్జాలపురోభివృద్ధి శాస్త్రీయదృష్టిని బలవత్తరం చేస్తోంది. కళనీ, తత్త్వాన్నీ, మతాన్నీ, విద్యనీ, వ్యక్తిగత మానసిక వ్యవస్థనీ అన్నిటినీ శాస్త్రీయదృష్టితో చూసి జీవన సార్థక్యత సంయమనంతో సాధించాలనే ప్రాథమిక సత్యాన్ని సాహిత్య వ్యవసాయం ద్వారా ప్రకటించిన కోరాడ వంశ మహనీయులు సాగిన మార్గంలో నడుస్తున్న ప్రస్తుత తరాల్లో కోరాడ కమలాదేవి, కోరాడ రామకృష్ణ, కోరాడ సూర్యనారాయణ, గుమ్మలూరి శ్రీకాంత, గుమ్మలూరి ఇందిర భారతదేశం నుంచి, శొంఠి శారదాపూర్ణ, శొంఠి సీత, గుమ్మలూరి సత్య, డా. శొంఠి సిరి తెలుగు సంస్కృత భాషలతోపాటు ఇతర ప్రపంచభాషలలో ప్రావీణ్యాన్ని, వైదుష్యాన్ని సాధించి అంతర్జాతీయస్థాయిలో విదేశాలలో భాషా సారస్వత పరిశ్రమ చేస్తున్నారు.

తెలుగు భాషావగాహనా సమగ్రతకు దీపికగా నిలచిన ప్రపంచ విఖ్యాత భాషావేత్త కోరాడ మహాదేవశాస్త్రిగారి దివ్యసంస్మృతికి జోడు చేతులొకటిగా నమస్కరిస్తూ కోరాడ వంశీయుల సారస్వతాధ్యయన యజ్ఞం చిరంతనమవ్వాలని ఆశిస్తున్నాను.

*****

# నాన్నగారు - వారి జీవన ప్రస్థానం

**డా॥ కోరాడ రామకృష్ణ**
సెల్ : 9866798863

నాన్నగారు గుర్తుకు వచ్చినపుడల్లా మనసులో మెదిలేది వ్రాసుకుంటూనో, చదువుకుంటూనో ఉండే ఆయన రూపం. ఎప్పుడూ టేబులు మీద అనేక పుస్తకాలు ఉంచుకొని గంటల తరబడి వ్రాసుకుంటూనో, చదువుకుంటూనో ఉండేవారు. ఇలా వ్రాసుకుంటున్నప్పుడు ఆయనకి సమయం కాని, ఆకలికాని, నిద్రకాని తెలిసేవి కావు. వారి జీవితకాలం అంతా భాషాసేవలో నిమగ్నమై ఎన్నో ప్రసిద్ధ గ్రంథాలు రచించారు. వాటిలో చాలా మటుకు వారు చదువుకున్న భాషాశాస్త్రంకి సంబంధించినవి. నాన్నగారు తన జీవితమంతా రచనా వ్యాసంగంలో గడపడానికి కారణం అది వారికి చాలా ఇష్టమైన వ్యాపకం కావడమే. ఈ విధంగా నాన్నగారు నిత్యము పరిశ్రమిస్తూ, తన పనిని తపస్సుగా కొనసాగించిన మహనీయులు.

భాషాశాస్త్రంలో నాన్నగారికి అత్యంత ప్రియమైన విషయము శబ్దవ్యుత్పత్తి (Etymology) పదాల యొక్క చరిత్ర, వాటి అర్థపరిణామము మొ॥ విషయాలు అధ్యయనం చేయడం. ఏ పదానికైనా దాని వ్యుత్పత్తి, అర్థాన్నీ, ఇట్టే చెప్పేవారు. ఉదా:- చెఱ = మనుషులను బంధించేది. చెఱువు = నీటిని బంధించేది. ఇటువంటివి వారు చెబుతున్నప్పుడు వినడానికి ఎంతో ఆసక్తికరంగా ఉండేవి.

నాన్నగారికి వారి తల్లిదండ్రులు, గురువులు దైవ సమానులు. వారి తండ్రిగారు శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారిని, వారి గురువులు శ్రీ సునీతి కుమార్ ఛటర్జీగారినీ నిత్యము స్మరించేవారు. వారి తండ్రిగారి శతజయంతి సందర్భంగా నాన్నగారు, వారి బావగారైన శ్రీ గోపాలశాస్త్రిగారు కలిసి ఎంతో శ్రమించి, 'సాహితీ నీరాజనం'అన్న సంకలన గ్రంథాన్ని 1982లో ప్రచురించారు. దీనిని అప్పటి ప్రధానమంత్రి శ్రీ పి.వి.నరసింహారావుగారు ఢిల్లీలో ఆవిష్కరించారు. విలువైన వ్యాసాలతో కూడిన ఈ గ్రంథం అందరి మన్ననలను పొందింది. నాన్నగారు తన 88వ ఏట 'భాష - సంస్కృతి' అనే పుస్తకం వ్రాయడం మొదలుపెట్టారు. ఈ పుస్తకాన్ని వారు వ్రాయడం వెనుక రెండు ప్రధానమైన కారణాలు ఉన్నాయి. వారి గురువులవద్ద నేర్చుకొన్న భాషాశాస్త్రంలోని విశిష్ట అంశాలను అందరికి తెలియపరచడం మరియు తన తండ్రిగారు అసంపూర్తిగ వదిలేసిన పనిని తాను పూర్తి చేయడం, ఈ విధంగా తన పితృ ఋణం, గురు ఋణం తీర్చుకోవాలన్నది వారి కోరిక. వారు వ్రాసిన ఈ పుస్తకం గొప్ప గ్రంథంగా రూపుదిద్దుకుంది. ఈ గ్రంథంలోవారు తెలుగు భాషలోని అనేక ఆసక్తికర అంశాలను వివరించారు. ప్రముఖుల ప్రశంసలను అందుకొన్నారు.

నాన్నగారి పూర్వజన్మ సుకృతంవల్ల వారి జీవితమంత మహనీయుల సాంగత్యంలో గడిచింది. ఇటువంటి మహనీయులతోపాటు నాన్నగారు ఎందరో సద్గురులు, ఆధ్యాత్మిక గురువుల సన్నిధిలో ఉండి వారి దివ్య సందేశాలను విని, ఆశీర్వాదములను పొంది తరించిన అదృష్టవంతులు. నాన్నగారి పుణ్యమా అని శ్రీశ్రీశ్రీ సిద్ధేశ్వరానంద భారతీస్వామివారు, శ్రీశ్రీశ్రీ సద్గురు శివానందమూర్తిగారు మొదలగువారి ఆశీర్వాదం, అనుగ్రహం మాకూ కలిగాయి.

మా చిన్నప్పుడు నాన్నగారితో గడిపిన సాయంకాలాలు నేను ఎప్పటికీ మరువలేనివి. సాయంత్రం అయ్యేసరికి ఇంట్లో అందరం పెరట్లో చేరేవాళ్లం. నాన్నగారు ఎన్నో ఆసక్తికరమైన విషయాలు చెబుతుండేవారు. నేను నాన్నగారిని "నాన్నా ! ఓసారి ఏమైంది? అని అడిగేవాడిని. నా ఉద్దేశ్యం ఏమైనా చెప్పమని. వారు మొదలుపెట్టేవారు. గాంధీగారు ధోతీ ఎందుకు కట్టేవారో తెలుసా ?... స్వామీ వివేకానంద రామకృష్ణ పరమహంసను మొదట కలిసినప్పుడు....జర్మనీ అంతగా అభివృద్ధి చెందడానికి కారణం....ఐన్‌స్టీన్ గాంధీగారిని గురించి అన్న మాటలు.... వారు చెప్పిన ఇటువంటి విషయాలు మమ్మల్ని బాగా ఆకట్టుకునేవి. వారు చెప్పే విషయంతోపాటు,

చెప్పే తీరు చాలా గొప్పగా ఉండేది. మాకు ప్రసిద్ధ కథలు చెబుతుండేవారు. దీనికోసం లైబ్రరీ నుండి కథల పుస్తకాలు తెచ్చేవారు (World's Best Short Stories). వారు చెప్పిన కథల్లో విక్టర్ హ్యూగో వ్రాసిన 'లెస్ మిసరబుల్స్' అన్న కథ నేనెప్పటికీ మరచిపోలేను. అమ్మ తన తాతగారి వద్ద, తండ్రిగారి వద్ద తెలుగు, సంస్కృతం బాగా చదువుకుంది. ఆమె ఒక ఆధ్యాత్మిక విజ్ఞాన సర్వస్వము వంటిది. మాకు ఎన్నో పద్యాలు, శ్లోకాలు చెబుతుండేది. అమ్మ నాన్న చెప్పినవన్నీ మమ్మల్ని బాగా ప్రభావితం చేశాయి. వారు చెప్పిన మంచి విషయాలు మాలో మంచి విలువలు ఏర్పడడానికి బాటలు వేశాయి. నేను కళాశాలలో అధ్యాపకుడుగా చేరినపుడు సందర్భం వచ్చినప్పుడల్లా ఈ విషయాలు మా విద్యార్థులకు కూడా చెబుతూండేవాడిని.

నాన్నగారి జీవితం Simple Living and High Thinking అన్న సిద్ధాంతానికి ఉదాహరణగా చెప్పవచ్చు. వారు జీవితంపట్ల ఆశావాహదృక్పథం కలిగివుండేవారు. సమయం విలువ బాగా తెలిసినవారు. క్షణకాలం కూడా వృథా చేశేవారు కాదు. వారికి రావలసిన పదోన్నతులు రాకపోయినా, గొప్ప అవకాశాలు వచ్చినా రెండింటిని సమదృష్టితో స్వీకరించగలిగిన స్థితప్రజ్ఞులు. నాన్నగారు మితభాషి. అనవసరమైన విషయాలను గురించి ఎప్పుడూ ఎవరితోను ప్రస్తావన చేసేవారు కాదు. వారిని కలవడానికి వచ్చిన వారందరిని ఆదరించి, ఆప్యాయంగా పలకరించేవారు. వారి కృషిని ప్రోత్సహిస్తూ మార్గదర్శనం చేసేవారు. ఇంట్లో మాట్లాడుకునే సందర్భాలలోకూడా వారి మాటలు మితంగాను హితంగాను ఉండేవి. నేను కాలేజీలో లెక్చరర్‌గా చేరిన కొత్తలో నాన్నగారు నాతో అన్నమాట "ఏ ఇతర ఉద్యోగి తప్పు చేసినా అది ఒకరికే పరిమితమవుతుంది. ఒక గురువు తప్పు చేస్తే ఒక తరం విద్యార్థులందరూ ఆ తప్పుకు గురిఅవుతారు. అందువల్ల నీవు ఎప్పుడూ తప్పు చేయకుండా విద్యార్థులకి ఆదర్శప్రాయంగా ఉండాలి" అని, మరో సందర్భంలో నేటి జీవన విధానాలలో వస్తున్న మార్పులను గురించి ప్రస్తావిస్తూ వారు అన్నమాట "మనుషులు ప్రకృతి సిద్ధాంతాలకు అనుగుణమైన జీవన విధానాలను అలవరచుకోవటం ఎంతైన శ్రేయస్కరం" అని వారు చెప్పిన ఇటువంటి హితోక్తులు ఎన్నో.

నాన్నగారు నిరంతరము కొనసాగించిన కృషి, దానిలో పొందిన ఆనందం వారి ఆరోగ్యానికి, సంతోషానికి హేతువులయ్యాయి. ఈ ఉత్సాహమే వార్ధక్యంలో వచ్చే శారీరక, మానసిక రుగ్మతల నుండి వారిని దూరంగా ఉంచింది. నాన్నగారి జీవితం సాఫీగా కొనసాగడానికి ఇంకో ప్రధాన కారణం అమ్మ. అమ్మ కుటుంబ బాధ్యతలను ఓర్పుగా నిర్వర్తిస్తూ వారి మార్గాన్ని సుగమం చేస్తూ వారికి ఒక నిజమైన సహధర్మచారిణిగా నడుచుకుంది. వార్ధక్యంలో వారిని ప్రతి క్షణము కనిపెట్టుకుంటూ ఉండిన ఆమె ఓర్పు అనితర సాధ్యం.

"నా జీవితమే నా సందేశం" (My Life is my message) అన్న గాంధీగారి జీవన సిద్ధాంతాన్ని తన జీవితంలో అనుష్ఠించిన ఆదర్శప్రాయులు నాన్నగారు. ఉత్తమ విలువలతో కూడిన జీవన విధానాన్ని అనుసరిస్తూ వారు కొనసాగించిన జీవన ప్రస్థానం మాకు మార్గదర్శకమైనది.

*****

# నాన్నగారు

**డా॥ కోరాడ వేంకటరమణ**

**సెల్ : 7702085669**

నాన్నగారు బ్రహ్మశ్రీ కోరాడ మహాదేవశాస్త్రిగారు ఋషితుల్యులు. జన్మతః ప్రశాంత మనస్కులు, సౌమ్యమూర్తులు. పూర్వీకుల తపోబలం, తల్లిదండ్రుల ఔన్నత్యం, వారి గురువుల విద్వత్తు, గాంభీర్యం, మెలిగిన మహానుభావుల నడవడి వారి జీవన దృక్పథాన్ని ఎంతగానో ప్రభావితం చేశాయి. అదే విధంగా, ఎంతో మంది శిష్యులు, పరిచితులు నాన్నగారి చేత ప్రభావితులు అయ్యారు.

వారు గురువులను గురించి కానీ, వారి నాన్నగారు కోరాడ రామకృష్ణయ్యగారి గురించి కానీ తలవని రోజు ఉండేది కాదు. వారంతా మహాపండితులు. దేశ విదేశ భాషల్లో ప్రావీణ్యులు. ఒకసారి ఓరియంటల్ కాన్ఫరెన్స్‌లో వారి గురువులు, సునీతి కుమార్ ఛటర్జీగారి పిలుపుతో ప్రభావితం చెంది, తెలుగు భాషా సేవకై జీవితం అంకితం చేసారు. తెలుగు భాష కీర్తిని ప్రపంచమంతా వ్యాపింపచేశారు. అలాగే గాంధీ వారి జీవితాన్ని చాలా ప్రభావితం చేశారు. తమ నడవడితో బ్రిటీష్ సామ్రాజ్యాన్నే మార్చిన మహానుభావుడు నాన్నగారిమీద చెరగని ముద్ర వేయడం ఆశ్చర్యమైన విషయమేమీకాదు ! గాంధీగారితో నూలు వడకటం, ప్రతి సాయంత్రం బిర్లా హౌస్‌లో వారితో భజనలలో పాల్గొనడం తమ అదృష్టంగా భావించేవారు. వారి సమాజసేవ, వారి సమయ పాలన నాన్నగారిని ఎంతగానో ఆకట్టుకున్నాయి. 'క్షణశః కణశశ్చైవ విద్యామ్ అర్థం చ సాధయేత్' అన్నట్టు చివరి వరకూ సమయం వృథా చేసేవారు కాదు, ఏదో ఒకటి చదువుతూనో, రాసుకుంటూనో ఉండేవారు. వారు తమ సంపాదనని అందరితో ఆనందంగా పంచుకునే వారు. ఏ లోటూ లేకుండా జీవించాలంటే ఇదే మార్గం అంటారు ! సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారి ప్రసంగాల గురించి, వారి వాక్‌ధాటి గురించీ ప్రస్తావిస్తూ ఉండేవారు. అదే ప్రభావం కాబోలు, నాన్నగారి ప్రసంగాలు కూడా చాలా స్ఫూర్తిదాయకంగా ఉండేవి, తెలుగులో, ఇంగ్లీష్‌లోనూ కూడా! వారి అనుభవాలు, ఆశయాలు మమ్మల్ని తీర్చిదిద్దాయి మరి.

అమ్మ, నాన్న చిన్నతనంలో మాకు సుమతి శతకం, వేమన శతకం, పెద్దబాలశిక్షలోని విషయాలు నేర్పించేవారు. భగవద్గీత శ్లోకాలు కంఠస్థం చేయటం భక్తి యోగంతో మొదలెట్టాము. వేసవి శెలవుల్లో నేర్చుకోవడానికి అవకాశం ఎక్కువ ఉండేది. ఎనిమిదవ తరగతి పరీక్షలయిన తరువాత ఓ రోజు గ్యారేజీలో మూడు గంటలు కూర్చుని ఓ అధ్యాయం కంఠస్థం చేసేశాను. సెలవులకి తాతగారి వూరు వెడుతూంటే, తాతగారు బ్రహ్మశ్రీ ఖండవిల్లి సూర్యనారాయణ శాస్త్రిగారికి నాన్నగారు ఓ ఉత్తరం రాసి పంపారు "రమణకి భగవద్గీత 18వ అధ్యాయం నేర్పించండి" అని. అలాగే తాతగారు నేర్పించడం, భగవద్గీత పూర్తి కంఠస్థం చేయడం జరిగింది. తరువాత 'అమరకోశం' నేర్చుకునే ప్రయత్నమైతే జరిగింది కానీ అది సాగలేదు. అదీ నేర్చుకునివుంటే ఎంత బాగుండేది అనిపిస్తూ ఉంటుంది ! ఆటపాటలతో పాటు, చిన్నతనంలోనే పిల్లలకు పద్యాలూ, శ్లోకాలూ శ్రావ్యంగా పాడడం చదవడం నేర్పిస్తే పెద్దవారయిన తరువాత వారికి భాష మీద అభిమానం, ఒక ఉదాత్తమైన జీవన వైఖరి అలవడుతుందని నాన్నగారి విశ్వాసం.

నాన్నగారు స్పెషల్ ఆఫీసర్‌గా ఉన్న రోజుల్లో, యూనివర్శిటీల నుంచి వచ్చిన ప్రొఫెసర్స్, విసిటర్స్‌ని ఇంటికి తీసుకుని వస్తూవుండేవారు. అలాగే స్వామి చిన్మయానంద, స్వామి దయానంద సరస్వతి వంటి మహానుభావులు వస్తూ ఉండేవారు. వారి సాంగత్యం, వారి భాషణలూ చాలా విలువైనవిగా ఉండేవి.

నాన్నగారు ఎప్పుడైనా తీరిక దొరికినప్పుడు మాకు వివిధ భాషల్లో పదాలు వాటి చరిత్ర గురించి చెప్తూ ఉండేవారు. 2010లో కొన్ని తెలుగు పదాలు పుట్టు పూర్వోత్తరాలు గురించి

'శబ్ద వైచిత్రి (రొమాన్స్ ఆఫ్ వర్డ్స్)' అనే పుస్తకం రాయడం మొదలుపెట్టారు. అలా అలా పెద్దదై అది 'భాష – సంస్కృతి' పుస్తకంగా రూపుదిద్దుకుంది. 2014లో నేను అమెరికా నుంచి వచ్చి నాలుగు నెలలు పుస్తక ప్రచురణలో వారికి సహాయంగా ఉన్నాను. ఆ సమయంలో వారితో జరిపిన చర్చలు, మరి 93 ఏళ్ళ వయసులో కూడా వారి ఉత్సాహం ఆశ్చర్యం కలిగించేవి. ఎప్పుడూ ఇతరుల సౌఖ్యం గురించే ఆలోచిస్తూ ఉండేవారు.

నేను డిల్లీ యూనివర్శిటీలో చదవటానికి వెళ్ళేముందు నాన్నగారు నన్ను సంస్కృతం చదవమని ప్రోత్సహించడం, అప్పటికే నేను కెమిస్ట్రీ చదవాలని నిర్ణయించుకోవడంతో, సంస్కృతం నేను హాబీగా చదువుతానని చెప్పడం జరిగింది. వెనక్కి తిరిగి చూసుకుంటే, నాకు ఉన్న ఇంటరెస్ట్‌వలన, నేను తీసుకున్న నిర్ణయం సరి అయినది అనిపిస్తుంది. ఢిల్లీ యూనివర్శిటీలో ప్రొఫెసర్‌గాను, ఐఐటి ఢిల్లీలో రీసెర్చ్ తరువాత యేల్ యూనివర్శిటీ స్కూల్ ఆఫ్ మెడిసిన్‌లో, నోబెల్ ప్రైజ్ గ్రహీత 'ప్రొఫెసర్ థామస్ స్టెయిట్జ్' గారి దగ్గర విసిటింగ్ ప్రొఫెసర్‌గా చేయడం నా అదృష్టం.

పది తరాల మహా పండితుల వంశ పరంపర, ఎనిమిది తరాల నోబెల్‌ప్రైజ్ గ్రహీతల గురు పరంపర, అనాది అయిన ఆధ్యాత్మిక ఆచార్య పరంపర కలగడం నాన్నగారి ఆశీర్వాదం, భగవత్కృప !

*****

# నాన్నగారు - కొన్ని జ్ఞాపకాలు

**కొల్లిపాకం విజయలక్ష్మి**

సెల్ : **09940473657**

"కావ్యామృత రసాస్వాదనం సల్లాపస్సజ్జనైః సహ" అన్నట్లు కావ్యాలను చదివి ఆనందిస్తూ మహాత్ములైన సజ్జనుల సాంగత్యంలో సమయాన్ని గడపడం నాన్నగారి విషయంలో ఇంచుమించు నా పెళ్లయ్యేదాకా నేను చూసాను. నాన్నగారు యూనివర్శిటీలో వున్నన్నాళ్ళూ కూడా డిపార్ట్‌మెంట్ నుండి వచ్చేశాక మిగిలిన సమయంకాని, రిటైర్ అయ్యాక సమయంకాని ఈ రెండింటితోటే గడిపేవారు. నా పెళ్ళయిన తరువాత తన సాహితీ రచనలతో Work is Worship అన్నట్టు ఆయన చాలా సమయం అలా రాసుకుంటూ వుండేవారు. నంగనల్లూరు నించి ట్రిప్లికేన్‌కి పిల్లల్ని తీసుకునివెళ్ళి వస్తూ వుండేదాన్ని. ఎప్పుడూ తన పనిలో వారు నిమగ్నమై వుండేవారు. నా ఫ్రెండ్స్ ఎవరైనా ఇంటికి వస్తే నాన్నని ఈయన ఒక Workholic అంటూ పరిచయం చేసేదాన్ని. చాలా సార్లు, చాలామంది దగ్గర నాన్న "You should enjoy what you are doing, then only the quality of work will be good" అంటూ వుండేవారు. నాకు చాలాసందర్భాల్లో ఈ మాట నాన్న చెప్పటంవల్లనో ఏమో – ఈనాటికీ ఏదైనా శ్రమతో కూడిన పని చేస్తున్నా, తక్కువ వ్యవధిలో ఎక్కువ పని చెయ్యవలసివచ్చినా వెంటనే నాన్న మాటలు గుర్తుకు వస్తుంటాయి. ఈ వయస్సులో నేను నాన్న మాటలు అనుకుంటూ పని చేస్తుంటే ఆ మాటల్లో ఎంతటి సత్యం! అనిపిస్తుంది.

**కావ్యామృత రసాస్వాదనం :** నేను 5వ క్లాసు చదువుతుండగా నాన్నకి తిరుపతి నుండి అనంతపురం ట్రాన్సఫర్ అయి వెళ్ళటం జరిగింది. క్రొత్తగా పి.జి. సెంటర్‌కి నాన్నతోపాటు కొంతమంది లెక్చరర్లు, రీడర్లు, ప్రొఫెసర్లు అందరు అనంతపురం పి.జి. సెంటర్‌కి ట్రాన్సఫర్ అవటం, క్వార్టర్స్ రెడీ అయ్యాక అందరం, టౌన్ నుండి క్వార్టర్స్ వెళ్ళి ఆ కొత్త వాతావరణం అందరం చాలా ఎంజాయ్ చేశాము. ప్రతి రోజు నాన్న డిపార్ట్‌మెంట్ నుంచి రాగానే భాగవతం పుస్తకం తీసుకుని పోతన పద్యాలు చదువుతూండేవారు. కొన్ని పద్యాలు లోపల పని చేసుకుంటూ అమ్మా గొంతు కలిపేది. నాన్న దగ్గరే కూర్చుని నాన్నని ఇమిటేట్ చేస్తూ నేనూ తెలియకుండా ఎన్నో పద్యాలు నేర్చేసుకున్నాను. ప్రతి రోజు నాన్న డిపార్ట్‌మెంట్ నించి వచ్చాక ఇదే పని – కావ్యామృత రసాస్వాదనం!

**సల్లాపః సజ్జనైః సహ :** అనంతపురం వెళ్ళాక నాన్న చిన్మయా మిషన్ ప్రెసిడెంట్‌గా కొన్నాళ్ళు వున్నారు. ఆ టైమ్‌లో అనంతపురంలో గీతాజ్ఞాన యజ్ఞాలు జరగటం, మహాత్ములైన దయానంద సరస్వతి స్వామీజీ, స్వామిని శారదా ప్రియానంద వంటి సజ్జనులు ఎందరో మా ఇంటికి వచ్చి ఆశీర్వదించారు; వారితో వారి శిష్య బృందాలు కూడా వచ్చేవారు. ఇంట్లో అమ్మ వారందరికి మడిగా వండిపెట్టడం, వారు భిక్ష స్వీకరించే సమయంలో నాకు వచ్చిన శ్లోకాలూ అవీ వారి ముందు కూర్చుని నేను వల్లించటం, మెప్పులూ, దీవెనలూ స్వీకరించటం మరువలేని ఘట్టాలు. ఒకరోజు గీతా జ్ఞానయజ్ఞం జరుగుతున్న రోజులలో దయానంద సరస్వతీ స్వామి భిక్ష తీసుకుంటూ "విజీ! ఏదైనా శ్లోకం చెప్పు" అన్నారు వచ్చీరాని తెలుగులో. "శ్రియాశ్లిష్టో విష్ణుః స్థిరచర గురుర్వేద విషయో..." అని చెప్పుకుంటూ వెడుతుంటే మధ్యలో ఆపి "Very good, today's prayer in the meeting - Viji" అన్నారు. ఆ రోజు సాయంకాలం ఆయన నన్ను తనతో పాటు మీటింగుకు తీసుకువెళ్ళటం, నేను శ్లోకాలు స్టేజ్ మీద చెప్పటం, అందరి ప్రశంసలు పొందటం ఇప్పటికీ తలచుకుంటే ఒళ్ళు గగుర్పొడిచి, బ్రహ్మానందం అనుభవిస్తాను.

నాన్న స్పెషల్ ఆఫీసర్‌గా వున్నప్పుడు సభలకు, సమావేశాలకు చాలా మంది పెద్దవాళ్ళు (చీఫ్ గెస్ట్స్) వచ్చేవారు. వారు అందరూ ఇంటికీ వచ్చేవారు. గాయని యస్. జానకి తండ్రిగారైన యస్.చంద్రశేఖరంగారు, శ్రీశ్రీ లాంటి వారు కొందరు నాకు బాగా గుర్తు. ఇలా పెద్దవాళ్లు, మహాత్ములతో ఇల్లు కళకళలాడుతూ ఉండేది. మరి ఇదంతా సజ్జనసల్లాపమే కదా !

నేను అనంతపురం శ్రీ సత్యసాయి ఉమెన్స్ కాలేజీలో ఇంటర్మీడియట్, డిగ్రీలు చదివాను. ఈ సమయంలో శ్రీ సత్యసాయిబాబాగారు నిర్వహించిన సమ్మర్ స్కూల్స్‌లో

వరుసగా మూడేళ్ళు పాల్గొన్నాను. స్వామివారి అనుగ్రహ భాషణములు, ప్రవచనములు తెలుగులో ఉండేవి. మా క్లాస్‌మేట్స్ చాలా మంది నార్త్ ఇండియన్స్‌కి అవి అర్థమయ్యేవి కావు. ఆ సమయంలో నాన్నగారు జర్మనీ నుండి వస్తూ నాకని ప్రత్యేకంగా ఒక టేపు రికార్డురు తెచ్చి, గిఫ్టుగా ఇచ్చారు. స్వామివారి భాషణలను నేను రికార్డు చేసి, వాటిని ఇంగ్లీషులోకి అనువాదము చేసి వారికి చెప్పేదాన్ని. ఇలాగ మూడు సంవత్సరాలు సమ్మర్ స్కూల్స్‌లో పాల్గొని, పరీక్షలు వ్రాసి, డిప్లొమా ఇన్ సత్యసాయి ఎడ్యుకేషన్ పొందిన దే స్కాలర్ నేను ఒక్కర్తినే. దీన్ని నేను చాలా గర్వకారణంగా భావిస్తాను.

**అమ్మానాన్నలు మాకు ప్రథమ గురువులు :** పి.జి. సెంటర్ క్వార్టర్స్‌లో వుండగా, మా చిన్నప్పుడు ప్రతి రోజు నేను అన్నయ్యలూ, తమ్ముడూ అందరం ఇంటికి సాయంత్రం 6 గంటలకల్లా కరెక్ట్‌గా వచ్చేసేవాళ్ళం. నాన్న 6 నుండి 7 గం॥ వరకు భగవద్గీత చెప్పించేవారు. అమ్మ రావణకృత శివతాండవ స్తోత్రం, మార్కండేయకృత చంద్రశేఖరాష్టకం ఈ రెండూ ప్రదోషవేళ ప్రతిరోజు చెప్పాలి అని ఆ స్తోత్రాలు నేర్పించింది. అందువల్ల ప్రతిరోజు పై స్తోత్రాలూ, భగవద్గీత అందరం కలిసి చెప్పేవాళ్ళం. ఈ విధంగా గీతా, శివస్తోత్రాలు ప్రతిరోజు విడవకుండా కొన్ని సం॥ల పాటు రెగ్యులర్‌గా చెప్పేవాళ్ళం. ఓసారి నాన్నకోసం పెద్ద హోదాలో వున్న ఓ పండితుడు మేము శ్లోకాలు చెప్తుంటే వచ్చి కూర్చుని, అంతా విన్నాక "మీ యిల్లు ఓ గురుకులంలా ఉందండి" అని సంతోషం, ఆనందం వ్యక్తపరిచారు. అమ్మ తన చిన్నతనంలో తన తాతగారి దగ్గర నేర్చుకున్న ముకుందమాల శ్లోకాలు, రుక్మిణీ కళ్యాణంలోని పద్యాలూ అన్ని నేర్పించింది నాకు. మరి యిటువంటి గురువుల దగ్గర నేర్చుకున్న విద్య ఎలా విస్తరించిందో తెలుసా ? ఈ రోజు తమిళ బాలబాలికలకు నేను సంస్కృత శ్లోకాలూ, భగవద్గీత, విష్ణు సహస్రనామం నేర్పించగలగుతున్నాను అంటే అమ్మ నాన్నల ఆశీర్వాదమే.

తమిళభాషలో వారు ఒత్తులు సరిగా పలకకుండా తేల్చేస్తారు కనుక సంస్కృత ఉచ్చారణ సరిగా వుండకపోవడం జరుగుతుంది. అందువలన ఏనాడో ఓ 40 సంవత్సరాలకి ముందు అమ్మ, నాన్న నేర్పిన భగవద్గీత, ముకుందమాల, విష్ణు సహస్రనామాలు స్పష్టమైన ఉచ్చారణతోపాటు తమిళులకు నేర్పించి సేవచేసే భాగ్యం కల్పించాడు ఆ భగవంతుడు. తమిళనాడులో శ్లోకాల పోటీలు కూడా చాలా జరుగుతాయి. అమ్మా, నాన్న నంగనల్లూరు వచ్చినప్పుడల్లా ఇక్కడ నేర్చుకుంటున్న పిల్లలు కాంపిటీషన్స్‌కి వెడుతూ ముందర మన ఇంట్లో ఓసారి ప్రాక్టీస్ చేసి నమస్కారం చేసి వెళ్ళటం, వారి శ్రద్ధాసక్తులు చూసి, అమ్మానాన్న పడే సంతోషం చూస్తే తాతగారు నాకు నేర్పించిన "సంతోషం జనయేత్ ప్రాజ్ఞః తదైవ ఈశ్వర పూజనమ్" అనే మాటలు గుర్తుకొచ్చేవి. అమ్మకి, నాన్నకి ఆ ఒక్క సంతోషాన్ని తప్ప ఏమీ ఇవ్వలేకపోయాను. ఒక్క నిజం ఏమిటంటే అమ్మతోనూ, నాన్నతోనూ కూడా నేను గడిపే సమయంలో ఎక్కువ సమయం భగవద్గీతో, ఏవో స్తోత్రాలో, భారత భాగవతాది పురాణ విషయాలే మాకు చర్చనీయాంశంగా వుండేవి. అమ్మ ఏమైనా మాట్లాడుతూంటే విదురనీతులు కాని, భర్తృహరి సుభాషితాలు కాని quote చేస్తూనే వుండేది. ఈ రోజుకీ అమ్మ మాటల్లో ఇలాంటి సుభాషితాలు దొర్లుతూనే ఉంటాయి. అమ్మ సార్థక నామధేయురాలు అని అనుకుంటుంటాం.

మరి నాన్నని నేను చివరిగా కలిసినపుడు "పిల్లలు వచ్చి నేర్చుకుంటున్నారా ?" అని "మంచి వ్యాపకం, You are doing good thing" అని ఆయన నాతో పలికిన చివరి మాటలు.

''Nextime వచ్చేప్పుడు కాళహస్తి స్వామీజీ 'గీతామకరందం' పట్రా చూద్దాం" అన్నారు. మా యిద్దరి మధ్య చర్చనీయాంశం గీత. ఈనాడు నా ఉచ్ఛ్వాసనిశ్వాసలు భగవద్గీత అని చెప్పటంలో అతిశయోక్తి లేదు.

శ్రీ శంకరాచార్యులవారు 'భజగోవిందం'లో

"గేయం గీతా నామసహస్రం<br>ధ్యేయం శ్రీపతి రూపమజస్రమ్ ।<br>నేయం సజ్జన సంగే చిత్తం<br>దేయం దీన జనాయచ విత్తం ॥"

మరియు

"భగవద్గీతా కించిదధీతా<br>గంగాజలలవకణికాపీతా"

రెండు శ్లోకాల్లోనూ గీతకు ప్రాధాన్యం ఇవ్వటం చూస్తాం. ఆ గీత చెప్పిన బాటని అనుసరించి నిశ్చల తత్త్వాన్ని పొందుదముగాక !

*****

# నాన్నగారి జ్ఞాపకాలు

**ఆచార్య కోరాడ సూర్యనారాయణ**

**సెల్ : 9849981846**

నాన్నగారు శ్రీ కోరాడ మహాదేవశాస్త్రిగారి స్మృత్యంజలి సందర్భంగా నా అనుభవాలు కొన్ని ఇక్కడ జ్ఞాపకం చేసుకొంటున్నాను. తెలుగు భాషలో మా పూర్వీకులైన శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రిగారు అనేక నూతన సాహిత్య ప్రక్రియలకు ఆద్యులైతే, మా పితామహులైన శ్రీ రామకృష్ణయ్యగారు భాషాధ్యయనంలో ఒక కొత్త ఒరవడిని సృష్టించి, భావిపరిశోధనలకు పునాదులు వేశారు. అలాంటి వంశంలో జన్మించిన నాన్నగారికి సహజంగానే తెలుగు భాషా, సాహిత్యములయందు విశేష అభిరుచి ఆసక్తులుండేవి. "ఆంధ్రత్వం ఆంధ్రభాషా చ నాల్పస్య తపసః ఫలమ్" అన్నట్లుగా వారు ఆజీవనం ఈ భాషాధ్యయనాన్ని ఒక తపస్సులాగా ఆచరించిన మహనీయులు. ఎంతోమంది శిష్య, ప్రశిష్యులకు ఒక ఉత్తమ ఉపాధ్యాయుడిగా, పరిశోధకుడుగాను, అందరికీ ఒక మహోన్నతవ్యక్తిగాను వారు సుపరిచితులు.

మా ఇంట్లో నేను అందరికంటే చిన్నవాడిని. ఇద్దరు అన్నయ్యలు, అక్కయ్య ఆధునిక విద్యలనభ్యసించడంవలన కుటుంబంలో ఎవరైనా వంశపారంపర్యంగా వస్తున్న సంస్కృతాంధ్రభాషలనధ్యయనం చేసి, ఈ పరంపరను కొనసాగిస్తే బాగుంటుందనే ఉద్దేశ్యంతో కాబోలు నాన్నగారు అప్పుడప్పుడు మాటల సందర్భంలో "నువ్వు సంస్కృతం చదువు"అని నాతో చెబుతూ ఉండేవారు. నాకైతే సంస్కృతం అంటే ప్రత్యేకమైన ఆసక్తి ఏమీ ఉండేదికాదు. అలాగని అనాసక్తి లేదు. మా తాతగారు శ్రీ ఖండవిల్లి సూర్యనారాయణ శాస్త్రిగారు గొప్ప వేద పండితులు, సాహిత్య శాస్త్రంలో విశేష పరిశ్రమ చేసినవారు. వారు మా ఇంటికి వచ్చినపుడు వేదాలు, ఉపనిషత్తుల గురించి, మరియు కావ్యాలలోని అనేక చమత్కారశ్లోకాలు చెప్తూ ఉండేవారు. మేము అనంతపురము స్నాతకోత్తరకేంద్రంలో (Post Graduate Centre) లో ఉండేటపుడు నాన్నగారితో తెలుగు విభాగంలో పనిచేసే కీ॥శే॥ శ్రీ కల్లూరు నాగభూషణరావుగారు నాతో "తెలుగులో చిన్నయసూరి ఉన్నాడు, నీవు పెద్దయసూరి కావాలి" అని నాతో అంటుండేవారు. బహుశా హాస్యోక్తిగ వారు అలా అని ఉండవచ్చు. నాన్నగారు స్పెషల్ ఆఫీసరుగ ఉండటంవలన ఎంతోమంది పెద్దలు (శ్రీశ్రీ, సి. నారాయణరెడ్డి మొదలైనవారు) మా ఇంటికి వచ్చినపుడు "ఏమిటి మీ ఇంట్లో ఎవరూ తెలుగు, సంస్కృతం చదవట్లేదా?" అని ఆశ్చర్యం వెలిబుచ్చేవారు. ఈ విధంగా పెద్దలమాటలు తెలియకుండానే నేను సంస్కృతం చదవడానికి దోహదం చేసాయని చెప్పవచ్చు.

నేను ఎం.ఏ. చదువులకు మా ప్రొఫెసర్ గారైన శ్రీ మల్లాది బాలసుబ్రహ్మణ్యంగారి ప్రోత్సాహంతో పూనాలోని సంస్కృత ప్రగతాధ్యయన కేంద్రం (Centre of Advanced Study in Sanskrit)లో చేరాను. అక్కడ ఎం.ఏ., ఎం.ఫిల్. డిగ్రీలు పూర్తి అయ్యాక ఏదైనా ఉద్యోగంలో చేరుదామనే ఉద్దేశ్యంతో ఉద్యోగ ప్రయత్నాలు మొదలుపెట్టాను. ఈ విషయం నాన్నగారికి తెలిసి "ఇప్పుడు ఉద్యోగానికేం తొందర, మొదట పిహెచ్.డి. పూర్తి చెయ్యి" అని చెప్పారు. వారి ఆదేశానుసారం నేను ఉద్యోగాన్వేషణ విరమించి, పిహెచ్.డి. కొనసాగించాను. వారు దూరదృష్టితో చెప్పిన ఆ మాటలోని విజ్ఞత అనంతరకాలంలో నాకు బోధపడింది. ఉద్యోగంలో చేరి, ఉద్యోగ, కుటుంబ బాధ్యతలతో 3 సంవత్సరాలలో చేయవలసిన పని, దశాబ్దాలకాలం వరకు చేయలేకపోవడం నేను చాలా సందర్భాల్లో గమనించిన విషయం.

పిహెచ్.డి. అయితే వచ్చిందికానీ, ఉద్యోగ విషయంలో కొంత ఇబ్బంది పడవలసి వచ్చింది. సంస్కృత భాషే కాదు, ఆధునియుగంలో ఏ భాషాధ్యయనం చేసేవారైనా ఎదుర్కొనే పరిస్థితే ఇది. అందుకని నేను వెంటనే అప్పుడే అభివృద్ధి చెందుతున్న సంస్కృత – సంగణక పరిశోధనాక్షేత్రంలో చేరాను. ఢిల్లీలోని జె.ఎన్.యు.లో పదేళ్ళు పనిచేసి, కంప్యూటరు విషయమై పరిజ్ఞానం సంపాదించాను. దాని ఆధారంగా నాకు తిరుపతిలోని రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠంలో ఉద్యోగం వచ్చింది. అనతికాలంలోనే లెక్చరర్, రీడర్, తర్వాత ప్రొఫెసర్‌గా పదోన్నతులు రావడం వెనుక ఆ భగవంతుని అపారమైన అనుగ్రహము, మా పెద్దల ఆశీర్వాదము ఉన్నవని నేను గట్టిగా విశ్వసిస్తాను.

ఒకసారి అలహాబాద్‌లోని శ్రీ గంగానాథ్ ఝా సంస్కృత కళాశాలవారు సంస్కృతంలో పిహెచ్.డి. చేస్తున్న పరిశోధక విద్యార్థులకు నెలరోజులపాటు ఒక కార్యశాల (Workshop)ను నిర్వహించి, ఆఖరి రెండు రోజులు నా ఉపన్యాసాన్ని ఏర్పాటు చేశారు. 'సంస్కృతానుసంధానకర్మణి సూచనాతంత్రస్య అనుప్రయోగః' (Role of Information Technology in Sanskrit Research) అనేది నా వ్యాఖ్యాన విషయం. ఈ విషయాన్ని గురించి చాలా మందికి తెలియకపోవటం వలన, నేను చెప్పిన విషయాలు విద్యార్థులకు చాలా కొత్తగాను, ఉపయోగకరంగాను అనిపించాయి. ధన్యవాదసమర్పణ చేస్తూ ఒక విద్యార్థి 'అస్మాన్ పాఠితేషు అధ్యాపకేషు కో రాట్? ఇత్యుక్తే సూర్యనారాయణః ఏవ' అని చమత్కారంగా చెప్పాడు. (మనకు పాఠాలు చెప్పిన అధ్యాపకులలో ఉత్తమ అధ్యాపకుడు ఎవరు? అని ప్రశ్న, సంస్కృతంలో కః = ఎవరు, రాట్ = రాజు అని అర్థం). కోరాడ అన్న పదాన్ని ఈ విధంగా సంస్కృతంలో సమన్వయం చేసి చెప్పటం చాలా వినూత్నంగాను, ఆనందంగాను అనిపించింది.

నాన్నగారు లౌకికవిషయాలకు అతీతంగా ఉండేవారు. కీర్తిప్రతిష్ఠలు, ధనార్జన వంటి విషయాలకు ఎక్కువ ప్రాధాన్యతను ఇచ్చేవారు కాదు. పని చేయటంలోనే వారు ఆనందాన్ని పొందేవారు కనుక వేరే విషయాల మీద ధ్యాస ఉండేది కాదు. పురస్కారాలకోసం పాకులాడటం, ప్రయత్నించడం వంటివి వారికి తెలియని విద్య. అయితే "న రత్నమన్విష్యతి మృగ్యతే హి తత్" (రత్నము అన్వేషింపదు, అది అన్వేషింపబడుతుంది) అన్నట్లుగ అవార్డులు వారిని వెతుక్కుంటూ వచ్చాయి. ఆ అవార్డులను పొందటం వలన నాన్నగారికి కలిగిన గౌరవం కంటే ఆ అవార్డులను వారు అందుకోవటంవలన వాటికి గౌరవం కలిగిందనే విషయం దాదాపు అన్ని పురస్కారసభల్లోను చెప్పబడిన మాట.

నాన్నగారు వారి చివరిరోజుల్లో తిరుపతి వచ్చి, మా దగ్గర ఉండటం నాకు చాలా ఆనందాన్ని కల్గించిన విషయం. ఎన్నో విషయాలు తెలుసుకోవటానికి, చర్చించటానికి నాకు అవకాశం కలిగింది. సుమారు రెండు దశాబ్దాల కాలం నేను వివిధ ప్రాంతాల్లో ఉండటం చేత, వారితో ఎక్కువ సమయం గడపలేకపోయేవాణ్ణి. నాన్నగారిని, అమ్మగారిని కలవడానికి ఎంతోమంది వారి శిష్యులు, మిత్రులు, బంధువులు ఇంటికి రావడం, వారందరినీ కలవడం మరింత ఆనందదాయకమైన విషయం.

మా పూర్వీకులు వ్రాసిన సంస్కృత గ్రంథాలు, కావ్యాలు వెలుగులోకి తీసుకువచ్చి, లోకానికి తెలియచేయవలసినదిగా నాన్నగారు నన్ను ప్రోత్సహించారు. ఈ క్రమంలో నేను శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రిగారు వ్రాసిన 'ఘనవృత్త'మనే మేఘప్రతిసందేశ కావ్యాన్ని వృత్తి, వివరణ, అనువాదాలతో సంపాదన చేయడం జరిగింది. 2015వ సం॥లో బ్యాంకాక్ నగరంలో జరిగిన 16th World Sanskrit Conference కి నేను మా విద్యాపీఠం తరఫున వెళ్ళి నా కావ్యాన్ని గురించి పత్రసమర్పణ చేయటం, అందరి ప్రశంసలు అందుకోవటం, నాన్నగారు ఎంతో సంతోషించటం నాకు ఈ దిశలో మరింత కృషి చేయటానికి కావలసిన విశ్వాసాన్ని, ఉత్సాహాన్ని కలిగించాయి.

నాన్నగారికి సంకల్పబలం ఎక్కువ. ఎట్టి పరిస్థితుల్లోను తనవల్ల ఎవరూ ఇబ్బంది పడటం వారికి ఇష్టం ఉండేది కాదు. వారి చివరి రోజుల్లో నడవలేని పరిస్థితుల్లో నేను, అన్నయ్య రమణ దగ్గర వుండి వారికి సేవ చేసేవాళ్లం. 'నావల్ల మీకు చాలా శ్రమ కలుగుతోంద'ని బాధపడేవారు. తరువాత ఆస్పత్రిలో చేర్పించిన మూడు రోజులకే వారు మరణించారు. వారనుకున్నట్లుగా ఎవరికీ కష్టం కలుగకుండా అనాయాస మరణాన్ని పొందారు. 'మా నాన్నగారు (రామకృష్ణయ్యగారు) ఇక్కడే (తిరుపతిలోనే) పరమపదించారు. నేను కూడా వారిలాగ ఈ క్షేత్రంలోనే చివరి శ్వాస విడుస్తా'నని మాతో చెప్తూ ఉండేవారు. అలాగే చివరి వరకు వారి తండ్రి మార్గంలోనే నడిచారు.

లౌకిక విద్యలు ఎన్ని చదివినా, వాటి పరిధి సీమితమై ఉంటుంది. లౌకిక వ్యవహారాలకు అతీతమైన ఆధ్యాత్మిక జ్ఞానాన్ని, ఆత్మ విద్యనభ్యసించటానికి సంస్కృతం ఒక రాజమార్గం. "ఆధ్యాత్మవిద్యా విద్యానాం" అన్నట్లుగ "యేన విజ్ఞాతేన సర్వం విజ్ఞాతం భవతి, వాచారంభణం వికారో నామధేయం" అని ఉపనిషదాది గ్రంథాల్లో ఉన్న ఆధ్యాత్మిక జ్ఞానాన్ని తెలుసుకోవటానికి, కేవలం అనువాదాల మీద ఆధారపడకుండా, యథార్థాన్ని గ్రహించటానికి సంస్కృత భాషా పరిజ్ఞానం ఎంతైనా అవసరం. ఈ విధంగా శ్రేయోమార్గాన్ని అవలంభించటానికి కూడా నాన్నగారు దిశా నిర్దేశం చేసిన వారయ్యారు.

*****

# నా చిన్నతనం - చిన్నన్నయ్య జ్ఞాపకాలు

**శ్రీమతి భమిడి కమలాదేవి**

సెల్ : **9959988944**

నాకు మా చిన్నన్నయ్య గురువు, అధ్యాపకుడు. నాలోని రచయిత్రిని గుర్తించి, ప్రోత్సహించిన మార్గదర్శి. ఎవరిలో ఏకాస్త విద్వత్తున్నా వెలికితీసి, ప్రోత్సహించి, వారికి సముచిత స్థానాన్ని పొందించాలని తపనపడే సహృదయం. చూడగానే ఎంత సౌమ్యులు ! అనిపించే వ్యక్తిత్వం. ఆ తరం హీరోలను బోలిన అందం !! దశాబ్దాల తరబడి విశ్వవిద్యాలయాల్లో బోధనానుభవం, అకుంఠిత దీక్షతో కూడిన కర్తవ్యపాలన, వెరసి....చిన్నన్నయ్య. కోరాడ మహాదేవశాస్త్రి.

నాకు 5, 6 సం॥లప్పుడు అమ్మా నాన్నగారు, నేను సిమ్లా (హిమాచల్‌ప్రదేశ్) వెళ్ళాం. అన్నయ్య అప్పుడు అక్కడ ఉద్యోగం చేస్తున్నాడు. అన్నయ్యకి నేనంటే చాలా వాత్సల్యం! "హార్లిక్స్" కొత్తగా మార్కెట్‌లోకి వచ్చిన రోజులవి. నా కోసం కొని పట్టుకొచ్చి, తనే కలిపి నాచేత తాగించేవాడు. చల్లటి వాతావరణంలో వెచ్చగా తాగుతుంటే కలిగిన ఆనందమూ, ఆ రుచీ, అన్నయ్య ఆప్యాయతలోని మాధుర్యమూ, ఆ రోజులూ, దృశ్యాలూ తలుచుకున్నప్పుడల్లా మనోనేత్రం ముందు కదలాడుతాయ్.

సిమ్లాలో అన్నయ్యతోపాటు శ్రీ విజయ రాఘవరావు కూడా ఉండేవారు. (అవును! తర్వాత కాలంలో ప్రఖ్యాత ఫ్లూట్ విద్వాంసులూ పద్మశ్రీ గ్రహీతలు వీరే!) ఆ రోజుల్లో వారు డాన్సు కూడా చేసేవారు. డాబా మీద నాకు స్టెప్స్ నేర్పించడం గుర్తుంది. డాన్స్ చేస్తున్నా, ఫ్లూట్ వాయిస్తున్నా అలా చూస్తూ ఉండిపోయేదాన్ని ! మహానుభావుల సాన్నిధ్యం అలౌకికం !!

సిమ్లాలో ఉన్నప్పుడే గాంధీగారి మీటింగ్‌కి వెళ్లాం అందరం. ఎంతమంది జనాలో ! పెద్ద మైదానంలో ఓ చెట్టు దగ్గర నిలబడి అందుబాటుగా వాలి ఉన్న చెట్టుకొమ్మ మొదట్లో నన్ను కూర్చోబెట్టి పట్టుకుని నిల్చున్నాడు అన్నయ్య. గాంధీగారేం మాట్లాడారో నాకు తెలియదుకానీ చివరలో 'వందేమాతరం' అంటూ ఎలుగెత్తి అంటూంటే నేను గట్టిగా 'వందేమాతరం' అనడం, పక్కనున్న వాళ్ళు నన్ను మెచ్చుకోలుగా చూడటం గుర్తుంది. జాతిపితను స్వయంగా చూడగలిగానన్న అనుభూతి మిగిల్చిందా సన్నివేశం. 'మహానుభావుల దర్శన మాత్రమైనా చాలు' ఆ Wave length లోని వారిపై విశేష ప్రభావం చూపడానికి. ఆనాడు చూసిన బాపూజీ ఈనాటికీ నాకు ఆదర్శం! నా జీవితాన్ని అనేక విషయాలలో ప్రభావితం చేస్తూనే ఉన్నారు. తర్వాతికాలంలో నాకు పెళ్ళై అత్తగారింటికి వెళ్ళేటప్పుడు గాంధీగారు కామెంటరీ రాసిన భగవద్గీత తెలుగు తర్జుమా పుస్తకం ఇచ్చారు నాన్నగారు. గృహిణిగా నా దైనందిన జీవితంలో కూడా భగవద్గీత పట్టుకొమ్మగా నిలిచి నన్ను సరియైన దారిలో నడిపింది ! ధన్యోస్మి !!

నాన్నగారి ఆకాంక్షను అర్థం చేసుకుని చేస్తున్న ఉద్యోగానికి రాజీనామా చేసిన అన్నయ్య అప్పటివరకు తను చదవని తెలుగు సారస్వతాన్ని చదవడం మొదలుపెట్టాడు. నాన్న కోరిక మేరకు Comparative Philology చదవడానికి కలకత్తా వెళ్ళాడు. అక్కడ శ్రీ సునీతి కుమార్ ఛటర్జీగారు అప్పటికే ఎంతో లబ్ధప్రతిష్ఠులు. వారి దగ్గర M.A. Philology పూర్తి చేశాడు. నాకు అన్నయ్య శ్రీరామచంద్రుడనిపిస్తాడు.

కలకత్తాలో యం.ఎ. పూర్తి చేసుకుని వచ్చిన అన్నయ్య అచ్చుమచ్చు బెంగాలీ బాబులా ఉండేవాడు. అప్పటికే శరత్‌బాబు నవలలు విరివిగా చదివేనాకు అందులోని హీరోల వర్ణన్ గుర్తుకొచ్చేది. కలకత్తాలో ప్రొఫెసర్‌గారి దగ్గర ఉన్నప్పటి విషయాలెన్నె చెబుతుండేవాడు. అందులో కొన్ని నన్ను అమితంగా ప్రభావితం చేసినవి. నాలో అంతర్లీనంగా ఉన్న ఆధ్యాత్మిక భావాల కవి రూపుకల్పించాయి. శ్రీ ఛటర్జీగారు ఏ రకపు సాధన చేసేవారో తెలీదుకాని, వారు దేనినైనా సంకల్పించి చెబుతే, అది తప్పక జరిగేదట ! ఆశ్చర్యంగా ఉండేదంటూ అన్నయ్య చెబుతుంటే ఉదాహరణలు విన్నప్పుడు

ఆశ్చర్యపడటం నావంతైంది. శిష్యులు ప్రశ్నిస్తే 'అది దైవశక్తి' అనే వారట. అన్నయ్య దగ్గర ఈ విషయం విన్న దగ్గర నుండి నాకే తెలియకుండా ఆ దైవశక్తి మీద నమ్మకం పెరిగింది. నా యిష్టదైవం శ్రీకృష్ణుడే 'దైవశక్తి'గా నడిపిస్తాడన్న విశ్వాసం కలిగింది. ఈ విధంగా నా ఆధ్యాత్మిక ప్రగతికి పరోక్షంగా చిన్ననాడే అన్నయ్య కారణమయ్యాడు.

కలకత్తాలో ఎం.ఏ. పూర్తి అయ్యాక మద్రాసువచ్చి, తెలుగు ఎం.ఏకి కట్టి నాన్నగారి దగ్గర చదువుకునేవాడు. అందులో భాగంగా కావ్యాలూ, ప్రబంధాలు, వ్యాకరణం మొ॥ చదివాడు. విజయవిలాసం, పారిజాతాపహరణం, పద్యాలు చదువుతూ– ఎంత చక్కగా ఉందో ఈ పద్యం వినవే.. అంటూ వినిపించి, నువ్వూ చదువు అనేవాడు. అలా ప్రబంధాల మీద మక్కువ పెరిగి, అవకాశం ఉన్నప్పుడల్లా పద్యాలు కంఠతా పట్టేదాన్ని. రచనల వైశిష్ట్యాన్ని, పద్యాలలోని సొగసూ అన్నయ్య విడమరచి చెబుతూంటే ఎంత బాగుండేదో ! నోటికొచ్చిన పద్యాలు చదువుకోవటంలో ఎంత ఆనందమో ! నాన్నగారు కళాపూర్ణోదయం పాఠం చెప్పడం ఇప్పటికీ గుర్తు. అన్నయ్యలతోపాటు వినేదాన్ని. చాలా ఆసక్తిగా సాగేది పాఠం ! పాఠం అయ్యాక చేసుకునే డిస్కషన్ మరింత బాగుండేది. అప్పట్లో వందలకొద్దీ పద్యాలు కంఠతాపట్టడం సరదాగా ఉండేది.

9వ క్లాసులో ఉండగా స్కూల్ మేగజైన్‌కి కథ రాయమని అడిగారు. నాకు కథలెలా రాస్తారో తెలీదాయె! అప్పుడు మా ఇంట్లో అద్దెకుంటున్న శ్రీ బులుసు వెంకట్రమణయ్యగార్ని అడిగాను. వారు ఓ శ్లోకం చెప్పి, అర్థం చెప్పి, దాన్ని ఒక కథలా రాయమన్నారు. "పేరులో ఏముంది ! అంటూ కథా రూపంలో రాశాను. దాన్ని ముందు అన్నయ్యకి చూపించాను. చూసి, 'బాగా రాశావ్! ఇలాగే ఏదో ఒకటి రాస్తూండు' అంటూ ప్రోత్సహించాడు. శ్రీ వెంకట్రమణయ్యగారు కూడా మెచ్చుకొని మరికొన్ని మెలకువలు చెప్పారు.

'నువ్వు తెలుగు ఎం.ఏ. చెయ్యాలే!' అనేవాడు అన్నయ్య. నాకూ అలాగే ఉండేది కోరిక, తెలుగు, సంగీతం ఎం.ఏ.లు చేయాలని. ఇంతకీ అప్పటికింకా SSLC కూడా కాలేదు! నాన్నగారు సంబంధాలు చూస్తూ పెళ్ళి చేసేస్తానన్నప్పుడు అన్నయ్య – చదివిద్దాం నాన్నా ! అంటూ ఎంతో చెప్పి చూశాడు. సంబంధమే మాకు దొరకలేదు కనక... అంటూ PUC క్వీన్ మేరీస్ కాలేజ్‌లో చేర్పించాడు స్వయంగా. ఎప్పటికప్పుడు పెళ్లి పేరుతో నా చదువు ఆగిపోయేది.

మొత్తానికి పై చదువుల ప్రమేయం, పెళ్ళితో, పాలంగి గ్రామపు కాపురంతో ఆగిపోయింది. నా నిరాశని పోగొట్టాలని, పరీక్షలకి కట్టించాలనీ అన్నయ్య ఎంతో కృషి చేశాడు. కాని ఒక పల్లెటూరి ఉమ్మడి కుటుంబంలో పెద్ద కోడలుగా అంత అవకాశం నాకు ఎక్కడిది ! కాని పుస్తకాలు చదవడం (తణుకు లైబ్రరి నుండి తెచ్చుకొని) ఆధ్యాత్మిక ప్రసంగాలు వినడం...క్రమంగా నాలో రాయాలనే ఉత్సుకతను పెంచింది. తోచిన వ్యాసాలు రాసి అలమారలో అలా ఉంచేదాన్ని.

1991లో నాన్నగారి శతజయంతి ఉత్సవ 'సాహితీనీరాజనం' కోసం 'నాన్నగారితో నా చిన్నతనం' గురించి చిన్న వ్యాసంరాసి బెరుగ్గానే అన్నయ్యకి చూపించాను. ఎందుకంటే ఎందరో లబ్ధప్రతిష్ఠులైన మహానుభావులమధ్య ఓ సామాన్య పల్లెటూరి గృహిణిని, అదీ స్వవిషయాల గురించి రాశాననుకుంటారని భయపడ్డాను. అందుకు అన్నయ్య – "స్వవిషయమే అయినా నువ్వే చెప్పినట్లు, ఆనాటి విలువలు నేటి తరానికి ఉపయోగపడేలాగే ఉన్నాయ్‌లే!" అంటూ మొత్తానికి నాన్నగారి సాహితీ నీరాజనంలో నాకూ ఓ చోటు దక్కింది. అన్నయ్య చలవ ! కొన్ని సాహితీపీఠాల్లో జరిగిన కార్యక్రమాల్లో పాల్గొని ప్రసంగించటంవల్ల నాలోని సంగీత సాహిత్య ఆధ్యాత్మిక భావాలను వ్యక్తీకరించే అవకాశం లభించింది. ఇందుకూ ప్రోత్సాహం అన్నయ్యదే !

(భక్తితత్వం) "ముకుందమాల" శ్లోకాలకి వ్యాఖ్యానంలా రాసిన కవితలు అలమారులో అన్నయ్య చూసి, చదివి, చాలా బాగున్నాయి. తప్పక పబ్లిష్ చెయ్యి అన్నాడు. ఆ రోజుల్లో (90లలో) డబ్బుతో కూడిన పని నేనెక్కడ చెయ్యగలను ? అంటే టి.టి.డి. గురించి చెప్పాడు. ఆ దిశగా ప్రయత్నించాను. సమయానికి కోరాడ రామకృష్ణ (మేనల్లుడు) టి.టి.డిలో

ఉండటంతో ఆ పుస్తకం ప్రచురణకు నోచుకొంది. పెద్దలైనవారి మన్ననలందుకుంది. అలాగే నా 'నాదయోగ వైభవం', 'శ్రుతి దర్శనం' పుస్తకాల విషయంలో అన్నయ్య ఆశీస్సులే నాకు శక్తి.

శ్రీనాథపీఠంలో శ్రీ ప్రసాదరాయ కులపతిగారు (ప్రస్తుత కుర్తాళం పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ సిద్ధేశ్వరానంద స్వామివారు) తన గురువైన అన్నయ్యకు శ్రీనాథ పీఠంలో కనకపుష్పాభిషేకం చేసినా, శ్రీశ్రీ శివానందమూర్తిగారు హైదరాబాద్‌లో పురస్కారాన్ని అందించినప్పుడూ, శ్రీమతి శారదాపూర్ణ శొంఠి (USA) అందించిన 'శ్రీకళాపూర్ణ' పురస్కారసభ, విజయవాడలో 'మండలి' వారి సత్కార సభ....ఇలా ఎన్నో పురస్కారసభలు ఏర్పాటు చేసినప్పుడు... కమల రావాలి. అది కూడా ఉంటే నాకు నిండుగా ఉంటుంది అంటూండేవాడు. నేను వస్తానంటే గంటముందు నుంచీ హాల్‌లో కూర్చుని ఎదురుచూసేవాడు. అంతదూరం నుండి ఎదురొచ్చేవాడు ! వెళ్తానంటే బెంగగా చూసేవాడు. చెన్నై నుండి తణుకులో దిగి తూర్పుగోదావరి జిల్లా (ముంగండ) వెళ్ళే ముందు తప్పక నన్ను కూడా రమ్మనేవాడు. ఇద్దరం కలిసి మావయ్య ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రి దగ్గరకెళ్తే.. అప్పుడు సారస్వత చర్చ! దారిలో కూడా ఏదో అంశం మీద విశ్లేషణలే ! కలిసినప్పుడల్లా నా కృషిని ఎప్పటికప్పుడు అభినందిస్తూ, సూచనలిస్తూ, ప్రోత్సహిస్తూ....''మా కమలాకుట్టి" ఇది. (చిన్నప్పుడు మద్రాసులో అందరూ ఇలా పిలిచేవారు. పెద్దైనా ఆ విషయాన్ని గుర్తుతెచ్చుకుని ఆనందించేవాడు. ఒకరు అన్నయ్య, మరొకరు మా బావగారు శ్రీ గోపాలశాస్త్రిగారు) చక్కని రచయిత్రి తెలుసా? అంటూ పరిచయం చేసి మురిసేవాడు.

భౌతికంగా విడిచివెళ్ళి పోయాడా సారస్వతమూర్తి. ఏడాది కావస్తూందప్పుడే! అన్నయ్య అచీవ్‌మెంట్స్ అన్నిటి వెనుకా వదిన ఓర్పుబలం ఉంది. ఎప్పటికప్పుడు దిశలు మార్చుకుంటూ సాగిన అన్నయ్య సాహితీ ప్రయాణంలో 'సరస్వతీదేవి' పాత్ర వెలకట్టలేనిది. "స్త్రీ చిత్తం పురుషుని భాగ్యం" అనేది మా అమ్మ. ఈ సారస్వత భాగ్యం ఆమెది కూడా. ఇది నిజం.

అన్నయ్య పురస్కార సభలన్నిటికీ దాదాపు వెళ్ళాను. సభలో లాంఛనంగా పొగడినట్లుకాక హృదయాంతరాళం నుండి వచ్చిన మాటలుగా – అన్నయ్యను సారస్వతమూర్తిగా, ఉత్తమ ఆచార్యునిగా, ఇతరుల మేలుకోరి తపించే త్యాగధనునిగా, సంతృప్తునిగా, మార్గదర్శకుడైన ఆదర్శమూర్తిగా.. అందరూ కొనియాడుతుంటే మనసు పులకరించిపోతుంది ! అలాంటి అన్నయ్యకు చెల్లెల్ని. ఈ అదృష్టం నే చేసిన పూజాఫలమో, మా పూర్వజుల పుణ్యఫలమో.

కోరాడవారి సంతానం మేం !!
ఇదిగాక సౌభాగ్యమిదిగాక వైభవం బికనొకటి కలదా!!

*****

# మా చిన్నమామయ్య కోరాడ మహాదేవశాస్త్రి

**డా॥ గుమ్మలూరి ఇందిర**

సెల్ : 9985386444

మా మాతామహులు బ్రహ్మశ్రీ కోరాడ రామకృష్ణయ్య, మాతామహి శ్రీమతి అన్నపూర్ణమ్మల సంతానం ఐదుగురు. వారు వరుసగా శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రి, ప్రొ. కోరాడ మహాదేవశాస్త్రి, శ్రీమతి సుసర్ల సీతాదేవి, శ్రీ కోరాడ నాగేశ్వరశాస్త్రి, శ్రీమతి భమిడి కమలాదేవి....అంటే మాకు ముగ్గురు మామయ్యలు, ఒక పిన్ని అన్నమాట! అయితే మొదటి ఇద్దరినే వేం పెద్దమామయ్య, చిన్నమామయ్య అని పిలిచేవాళ్ళం. ఆఖరిమామయ్య మాకు మామయ్యగాకంటే నాగేశ గానే అలవాటు. ఇక మా పిన్నిని కూడా మేం ఏనాడూ పిన్నీ! అని పిలువలేదు. తను ఇప్పటికీ ఎప్పటికీ మాకు కమలే... అసలు రహస్యమేమంటే ఆవిడ మమ్మల్ని 'పిన్ని' అని పిలువనిచ్చేది కాదు. మా పిన్ని ఎప్పటికీ మా అందరికీ స్నేహితురాలే....

తాతగారైన రామకృష్ణయ్యగారు నాకు గుర్తున్నది చాలా తక్కువ. నా చిన్నప్పుడే వారు దివంగతులయ్యారు. అయితే అమ్మతో మద్రాసుకి వెళ్ళినప్పుడు మేడ మీదకి వెళితే తాతగారు మా చేతిలో ఒక జిలేబీ ముక్కో, చాక్లెట్టు ముక్కో పెట్టి పోయి ఆడుకోండి అనేవారు ! క్రిందకి వచ్చాక మేడమీద నుంచి గట్టి గట్టిగా మాటలు మాత్రం వినబడేవి. బిక్కు బిక్కుమంటూ అమ్మ చీర చాటుకి వెళ్ళిపోయేవారం. అయితే ఆ కేకలు ఏమిటి అని తెలిసికొనే వయసు అప్పుడు మాకు లేదు. నాకు అర్థమయే వయసు వచ్చాక తాతగారి ఇంటికి వచ్చినవారు సాహితీవేత్తలూ, భాషాశాస్త్రవేత్తలూ, సంగీతశాస్త్రజ్ఞులనీ, ఆ అరుపులు సాహితీ చర్చలనీ అమ్మ, అమ్మమ్మ చెప్పేవారు. ఆ రోజుల్లో శ్రీయుతులు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు, రామకృష్ణయ్యగారి శిష్యులైన పింగళి లక్ష్మీకాంతంగారు, నిడదవోలు వెంకటరావుగారు, విశ్వనాథ సత్యనారాయణగారు, నండూరి రామకృష్ణమాచార్యగారు, యు. సుబ్బరాయభట్టుగారు. తిరుమల రామచంద్రగారు, సాంబమూర్తిగారు, ద్వారం వేంకటస్వామి నాయుడుగారు, ద్వారం భావన్నారాయణగారు....ఇలా ఆనాటి ఉద్దండ కవి పండితులందరూ తాతగారి ఇంటి మేడ మీద పండితచర్చలు చేసేవారని విన్నప్పుడు విని అయ్యో! వారిని గుర్తుపట్టలేకపోయానే, వారిని తెలిసికొనలేకపోయానే అని చాలా బాధపడ్డాను.

ఇక అమ్మమ్మ గురించి చెప్పాలంటే తాతగారు పోయాక అమ్మమ్మ మా ఇంట్లోనే ఉండేది. అమ్మమ్మ Voracious reader. నేను పిహెచ్.డి. చేస్తున్నప్పుడు లైబ్రరీ నుంచి పుస్తకాలు తీసికొని ఇంట్లోకి రాగానే నా చేతిలో పుస్తకాలలో తనకి నచ్చిన పుస్తకాలు గబగబా తీసికొని తన తలగడ క్రింద పెట్టేసికొనేది. తనకి ఖాళీ ఉన్న సమయంలో ఆ పుస్తకాలని క్షుణ్ణంగా చదివేసేది. నేను అమ్మతో, అమ్మమ్మతో ఆ పుస్తకాల్లో వాళ్ళు చదివిన విషయాలను చర్చించి అర్థం చేసుకొని, నాకు అవసరమైనవి వ్రాసికొనేదాన్ని. ఈ కారణంగా నా పిహెచ్.డి. డిగ్రీలో అమ్మతోపాటు అమ్మమ్మకీ సగం డిగ్రీ ఇవ్వాలి.

ఇక మామయ్య దగ్గరికి వస్తే....మామయ్య అనంతపురం వెళ్ళిపోయాక అక్కడికి మేము వెళ్ళలేదు. అయితే యూనివర్శిటీ పని మీద ఒకటి రెండు మార్లు మామయ్య విశాఖపట్నం వచ్చినపుడు ఆయనతో కలిసి కూర్చోవటం, మాట్లాడటం జరిగింది. ఒకరోజు అమ్మ మా అందరికి అన్నం పెడుతోంది....నేను అమ్మతో అమ్మా! నాకు కూర "చాలా కొంచెం" వెయ్యి అన్నాను. మామయ్య వెంటనే నీకు కూర 'చాలా' కావాలా ? 'కొంచెం' కావాలా ? అదేం పదప్రయోగమే ? అని ప్రశ్నించి రెండు వ్యతిరేక పదాలు ఒక చోట చేర్చావు. బావుంది అన్నాడు. ఈ విధంగా మాట్లాడిన ప్రతి పదంలో ఆ పదానికి అర్థమూ, దాని పుట్టుకా వివరించేవాడు.

మజ్జిగలో ఉప్పు వేసుకోవటం మాకు అలవాటు లేదు. కానీ మామయ్య వచ్చాడని అమ్మ ఉప్పు తెచ్చి బల్ల మీద పెట్టి మామయ్యకి వడ్డించబోయింది. అన్నయ్యా ! ఉప్పు వెయ్యనా ! అని అడిగింది. "ఉప్పే పస రుచులకెల్లా" అన్నాడు

సుమతీకారుడు. "ఉప్పు కప్పురంబు నొక్క పోలిక నుండు చూడ చూడ రుచుల జాడవేరు" అన్నాడు వేమన. ఇంతకీ ఉప్పు ఎప్పటిదో తెలుసే నీకు ఇందిరా ! ? అన్నాడు మామయ్య. అందరం ఒక్కమారు మాటలు ఆపేసాం. చెప్పు మామయ్యా ! అంటూ... మన దేశంవారికి ఉప్పు వేదకాలం నుంచీ తెలుసు. మన దక్షిణదేశ ప్రజలకు భగవంతుడు అంటే ఆ సముద్రుడు. ప్రకృతి సహజంగానే ఉప్పును ప్రసాదించాడు. కొన్ని కొన్ని స్థలాల్లో సముద్రపు ఒడ్డున నీరు ఎండిపోయి తెల్లటి పెచ్చులు లాంటి పదార్థం తేలటం మనవారు చూసి ఉంటారు. అదే ఉప్పు. అయితే దీన్ని ఉప్పు అని ఎందుకు అన్నారు ? అని ప్రశ్నించి, జవాబు కూడా మామయ్యే ఇలా చెప్పాడు. సముద్రతీర ప్రాంతాలలో కెరటాల ఉధృతికి నీరు ఉరవడిగా లేచి, గట్టును దాటి వచ్చినప్పుడు ఆ నీటిలో కరిగి ఉన్న ఒకానొక పదార్థం ఉర ఉరలాడుతూ ఎండిపోయిన తెల్లటి పదార్థంగా తయారవుతుంది కనుక దాన్ని ఉరుపు....ఉప్పు అని పిలవటం మొదలుపెట్టి ఉంటారు అన్నాడు. ఒక విధంగా ఇది ధ్వన్యనుకరణ పదం అన్నమాట ! ఇది పూర్తిగా తెలుగుమాట. ఈ మాటలకు సంస్కృతానికి ఏ విధమైన సంబంధం లేదు. ఎందుకంటే అమరకారుడు సంస్కృతంలో ఆరు రకాల లవణాలు చెప్పాడు. అవి వరుసగా 1. సాముద్రం, అక్షీబం, వశిరం ; 2. సైంధవం, శితశివం, మాణిబంధం, మాణిమంథం ; 3. రౌమకం, బస్తకం ; 4. పాక్యం, బిడం ; 5. సౌవర్చలం, అక్షం, రుచకం ; 6. తిలకం, మేచకలవణం వీటిలో ఏ ఒక్క పదానికీ ఉప్పుకీ సంబంధం లేదు కదే ఇందిరా ! అన్నాడు. అంతేకాదు తెలుగులో ఉరిమి చూచాడు అనే ఒక మాట ఉంది. కోపంతో, మండిపోతూ చూడటం. అంటే మనస్సులో ఉన్న మార్దవం, ఆర్ద్రత అంటే తడి ఆరిపోవటమే కదే ? కనుకనే ఈ పదానికి ఉరిమి చూడటం అనే పదం పుట్టి ఉంటుంది. ఊరబెట్టటం అనే ప్రక్రియ ఉంది. ఈ ప్రక్రియలో ఒకానొక వస్తువుని ఉప్పులో నానబెడుతున్నాం. ఇక్కడ కూడా ఆ వస్తువులో నీరు ఇంకి, ఎండుతోంది. ఉడుకు అంటే పక్వం, కాలటం, ఉప్పుడు బియ్యం అంటే ఉడకబెట్టిన బియ్యం...ఇక్కడ అన్ని చోట్లా...ఆయా పదార్థాల్లో నీరు ఇంకిపోవటం Common Factor...'ఉప్పెన' అనే మరో పదం ఉంది. ఈ పదం కూడా ఉప్పు, ఉబ్బు అనే పదాలవల్ల వచ్చింది. ఇది ఎలా వచ్చిందో తెలుసా ? ఒక్కొక్కప్పుడు సముద్రం ఉబ్బుతుంది. అప్పుడు ఆ ఉబ్బిన నీరు గట్టును గట్టిగా కొట్టగా అటు ఉప్పు అయింది ఇటు ఉప్పెన అయింది అని ఊహించవచ్చు. ఎందుకంటే ఉప్పెన సముద్రానికే వస్తుంది, నదులకీ, సరస్సులకీ రాదుగా? అన్నాడు. మన శరీరంలో కూడా ఉప్పు తయారవుతుంది. స్వేదం అంటే...అదేనే ! చెమట రూపంలో...నీకు ఇంకో విషయం తెలుసా ? జంతువులకి కూడా ఈ లవణం అవసరం ఉంటుంది. గుఱ్ఱాలకి, మరికొన్ని జంతువులకి సైంధవలవణం దాణాలో కలిపి పెడతారు. నీకు ఇంకో ఆశ్చర్యకరమైన విషయం తెలుసా ? కోతులు వాటి తోటి జంతువుల శరీరాల నుంచి ఏవో ఏరుకొని తింటూ ఉండటం నువ్వూ చూసే ఉంటావు. అవి పేలు తింటున్నాయి అని మనం భ్రమపడుతూ ఉంటాం. నిజానికి కోతులకి కూడా మనలాగే శరీరం చెమరుస్తుంది. అంటే చెమట పోస్తుందన్నమాట ! ఆ చెమట ఆరిపోయి వాటి రోమకూపాల్లో ఉప్పుపొరలు ఏర్పడుతాయట !. తమ తోటి కోతుల శరీరం నుండి అవి ఉప్పును వెతుక్కుని తింటాయి. ఉప్పుకి ఇంత కథ ఉంది తెలుసా ? అంటూ కథని పూర్తి చేశాడు. మామయ్యతో ఏ విషయం మాట్లాడినా పదాల దగ్గర ఆపేవాడు.. ఆ పదం పుట్టుపూర్వోత్తరాలు చెప్పేవాడు.

నా Ph.D. వ్రాయటం అయిపోయాక 1985-86 ప్రాంతంలో అమ్మతో నేను మద్రాసు వెళ్ళి నా Thesis చూపించాను. "విశ్వనాథవారి చారిత్రక నవలలు - మతదృక్పథము" అనేది నా పరిశోధనాంశం. అది ఇంచుమించు 1000 పుటల Manuscript. దాన్నంతటినీ మామయ్య నాలుగు రోజుల్లో చదవటం పూర్తిచేసి చాలా బాగా వ్రాసావు. ఏమీ మార్పులు చెయ్యనక్కరలేదు. అని ఆశీర్వదించి పంపాడు. ఆ సమయంలో అమ్మ, అత్త నాకు తాతగారు కూర్చుని పని చేసికొనే గది, వాళ్ళ చర్చలు, వాదోపవాదాలు జరిగిన స్థలం చూపించారు. ఏదో లోకంలో అడుగు పెడుతున్న చెప్పలేని భావన. నిజానికి అమ్మతో నేనొక్కర్తినే వెళ్ళినది కూడా ఆ ఒక్కమాటే..ఎప్పటికీ మర్చిపోలేని అనుభూతి అది. అత్త కూడా కొసరి కొసరి వడ్డించి, అమ్మకీ నాకూ బజారు

చూపించింది. కొన్ని క్రొత్త శ్లోకాలు నేర్పింది. మేం మా చిన్నప్పుడు దసరాకి బొమ్మల కొలువు పెట్టేవారం. ఆ పదిరోజులూ అమ్మ మా చేత మహిషాసురమర్దని శ్లోకాలు విధిగా పాడించేది. ఆ శ్లోకాలు మాకు కంఠతా రావటానికి అత్త పరోక్ష కారకురాలన్నమాట! అత్త దస్తూరీతో వ్రాసిన శ్లోకాల కాగితం అమ్మ దగ్గర చాలా కాలమే ఉండేది. తరువాత నేను దాన్ని పుస్తకంలో వ్రాసుకొన్నాను. వాటి సాయంతోటే అమ్మ మాచేత ఈ శ్లోకాలు రాగాయుక్తంగా పాడించేది.

తరువాత 1999లో అమ్మ మంచం మీద నుంచి లేవలేక ఉన్నప్పుడు అమ్మని చూడటానికి నేను బెంగళూరు వెళ్ళాను. తోవలో నేను అనంతపురంలో దిగి మామయ్యని అత్తని చూసి రెండు రోజులు మామయ్యతో గడిపి బెంగళూరు వెళ్ళాను. అప్పుడు నేను అమెరికన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఇండియన్ స్టడీస్‌లో తెలుగు హెడ్‌గా పనిచేస్తున్నాను. అమెరికన్స్‌కి తెలుగు నేర్పటం కోసం 'తేలికైన తెలుగు – తేట తెలుగు' అనే పేరుతో ఒక manual తయారు చేశాను. ఆ పుస్తకం మామయ్యకి చూపించాను. పుస్తకం అంతా క్షుణ్ణంగా చదివి, పరిశీలించి, చాలా బాగా వ్రాశావే ఇందిరా! చివర్లో చిన్న పిల్లల rhymes, పాటలు ఇచ్చావు. సర్వసమగ్రంగా ఉంది నీ పుస్తకం అంటూ మెచ్చుకున్నాడు. అలా చిన్నమామయ్య ఆశీస్సులు తీసికొని అమ్మ దగ్గరికి వెళ్ళాను. ఆ పుస్తకాన్ని పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారు ప్రచురించారు. దీనికి ముందే నా Ph.D. Thesis "విశ్వనాథ ధీషణాహేల" అనే పేరుతో అచ్చయింది. ఈ విధంగా నా పుస్తకాలు రెండూ కూడా మామయ్య ఆశీస్సులతో ప్రచురితం కావటం నా అదృష్టం.

మామయ్య గురించి ఆలోచన రాగానే గుర్తుకు వచ్చే విశేషణాలు... Disciplined, scholarlly and driven.. ఈ గుణాలే లేకపోతే ఇకనామిక్స్‌లో ఎమ్.ఏ. చదివి అప్పటికే చేస్తున్న చక్కటి ఉద్యోగాన్ని వదలి తెలుగు చదుతానంటూ రాడుగా ? ఆ రోజు మామయ్య ఆ నిర్ణయం తీసికోబట్టే ఈనాడు కోరాడ మహాదేవశాస్త్రిగారు అనే ఒక భాషాశాస్త్రవేత్త మనకి అంటే తెలుగుభాషకి దిశానిర్దేశం చెయ్యగలిగారు. ఈ కారణంగా వారికి తెలుగువారందరూ ఋణపడే ఉంటారు.

ఋష్యాణాకం దేవతాణాకం వా యథా
వైషాం పూర్వపురుషాణాం నామాని స్యుః ॥

పుత్రులకి మహర్షుల, దేవతల, తమ వంశపురుషుల పేర్లు పెడితే వారు పేరు ప్రఖ్యాతలు కలవారౌతారు అని ఈ శ్లోకానికి అర్థం. కోరాడ వంశ మూలపురుషుని పేరు మహాదేవశాస్త్రిగారు. తన వంశం ఏడు తరాల వరకూ పండితవంశం కావాలని తపస్సు చేసి శ్రీశైలంలో వేంచేసిఉన్న అమ్మవారినీ, అయ్యవారినీ మెప్పించి, ఒప్పించిన మనీషి, ఋషి ఆనాటి మహాదేవశాస్త్రిగారు.

మా చిన్నమామయ్యైన ఈ మహాదేవశాస్త్రి ఆ వంశంలో ఏడవతరానికి చెందినవాడు. మళ్ళీ మహాదేవశాస్త్రిగరు పుట్టటం అనేది ఆ దైవకృపే కదా? వారి మేనకోడలుగా పుట్టటం నేను చేసికొన్న పూర్వజన్మ సుకృతం అని వేరే చెప్పనక్కర లేదుగా ! అమ్మ పుణ్యమా అని కోరాడవారి రక్తం నాలో కూడా ప్రవహిస్తున్నందుకు ఆ మహాదేవునికి కృతజ్ఞతలు తెలుపుకుంటూ శతకోటి నమస్కారాలు.

*****

# అవిస్మరణీయ అనుబంధం

డా॥ కాశీ విశ్వనాథశర్మ
సెల్ : 9440361342

నా పేరు కలవకొలను కాశీవిశ్వేశ్వరశర్మ. నేను శలాక రఘునాథశర్మగారి నాల్గవ అల్లుడను. నేను తెలుగులో M.Phil., Ph.D. లు చేయాలనే ఉద్దేశ్యంతో గుంటూరు నుండి అనంతపురం శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయానికి 1997లో వచ్చాను. 1998లో వివాహమై అనంతపురంలో కాపురం పెట్టాను. అప్పుడు కోరాడ రామకృష్ణగారితో మామగారి కుటుంబ స్నేహితులుగా పరిచయం ఏర్పడింది. 2000 సం॥లో రామకృష్ణగారి సహకారంతో వారింటికి నాలుగు ఇళ్ళ సమీపంలో ద్వారకానగర్‌లో ఒక ఇంటిలో చేరాను. అప్పటి నుండి మహాదేవశాస్త్రిగారి కుటుంబంతో అనుబంధం ఏర్పడింది. రామకృష్ణగారు నాకు ఆత్మీయ మిత్రులు అయ్యారు. నేను, నా శ్రీమతి వారి కుటుంబంలో సభ్యులమైపోయాం. శాస్త్రిగారు నన్ను వాళ్ళబ్బాయిలతో సమానంగా చూసేవారు.

నేను M.A., సంస్కృతం S.V.U. లో ప్రైవేటు స్టడీగా చదువుకున్నాను. మాకు భాషాశాస్త్రం ఒక పేపర్‌గా ఉండేది. దానిని నేను నోట్సు రాసుకొని చదివి పరీక్ష గట్టెక్కాను. ఆ శాస్త్రాన్ని అందులో నిష్ణాతులైన శాస్త్రిగారి దగ్గర నేర్చుకోవాలని కోరిక కలిగింది. నా కోరిక ఆయనతో చెప్పగానే అలాగే అని నాకు భాషాశాస్త్రంలోని క్లిష్టమైన అంశాలను చాలా విపులంగా చెప్పారు. అపుడు నాకు ఆయనకున్న లోతైన విషయజ్ఞానం అర్థమైంది. నా నోట్సు చూసి ఇది ఔట్‌డేటెడ్ అని అనేసరికి నా అజ్ఞానం నాకు తెలిసింది. అలా శాస్త్రిగారు నాకు గురువైనారు.

శాస్త్రిగారు వయసురీత్యా రెండుసార్లు హస్పిటల్‌లో చేర్చాల్సిన అవసరం ఏర్పడింది. కొన్ని కారణాలవలన రెండుసార్లు నేనే హాస్పిటల్‌లో చేర్పించి ఆరోగ్యం కుదుటపడ్డాక ఇంటికి క్షేమంగా ఇంటికి తీసుకువచ్చాను. అపుడు అమ్మగారు (శాస్త్రిగారి శ్రీమతి సరస్వతిగారు) ఆనందంతో నా చేయి పట్టుకొని 'నీ చేతిచలువ వల్ల ఆయన క్షేమంగా ఇంటికి వచ్చారు'. అని ఆనందంతో పలికారు. ఆ క్షణంలో దైవం నాకు చాలా సహాయం చేశాడు అని అనిపించింది.

ఒకరోజున ఉన్నట్టుండి శాస్త్రిగారు నన్ను చూసి నేను ఆధ్యాత్మిక రంగంలో బాగాపైకి వస్తానని అన్నారు. ఆ వాక్యం నాకు ఆశీర్వదంలా అనిపించింది. నా ఆధ్యాత్మిక సాధనకు ఆ వాక్యం ఊతమిచ్చింది.

శాస్త్రిగారు తిరుపతి వెళ్ళే ముందు రోజు మా ఇంటికి రమ్మని ఆహ్వానించాను. ఆయన సంతోషంగా వచ్చారు. ఇల్లంతా కలియతిరిగి చూసి ఇల్లు బాగుందని అభినందించారు. అక్కడున్న ఊయలకుర్చీ చూసి ఇందులో కూర్చోవచ్చా అని అడిగి అందులో కూర్చుని అటూఇటూ ఊగుతూ చిన్నపిల్లవాడిలా ఆనందించారు. నేను ఆ దృశ్యాన్ని సెల్‌లో ఫోటోతీసి చూపించాను. నాకు ఫోటో ఇస్తావా అన్నారు. నేను మరుక్షణమే ప్రింట్ తీసుకొచ్చి ఇచ్చాను. ఆశ్చర్యంతో ఆనందంతో దానిని తీసుకుని జాగ్రత్తగా దాచుకున్నారు. 6 నెలల తరువాత తిరుపతిలో వారిని చూడటానికి వెళ్ళాను. ఆయన ఫోటో ప్రసావన తెచ్చి, ఆ ఫోటో మరొకటి ఇస్తావా అని అడిగారు. అపుడు నాకు ఆశ్చర్యం అనందం కలిగింది. ఆయన మా ఇంటికి రావటం, నేను ఆయనను చూడటం అదే ఆఖరుసారి అవుతుందని ఊహించలేదు. శాస్త్రిగారు 95 సం॥ల సంపూర్ణ ఆయుష్షును అనుభవించారు. ఒక ఋషి వంటి జీవితాన్ని గడిపారు. ప్రాచీన ఋషులలాగ భాషాశాస్త్రానికి ఆయన చేసిన కృషి, ఆయన తపఃఫలితమే తప్ప వేరేకాదు. చివరి రోజులవరకు సాహిత్యంలో ఆయన పడిన తపన చూసి నేటి యువత నేర్చుకోవలసిన అవసరం ఉంది.

మహాదేవశాస్త్రిగారి జీవితంపైన ఒక పుస్తకాన్ని ప్రచురించి భాషాప్రియులకు స్ఫూర్తిని కలిగించిన వారి కుమారులు రామకృష్ణ, వెంకటరమణ, సూర్యనారాయణ గార్లకు, వారికుమార్తె విజయలక్ష్మిగారికి నా ధన్యవాదములు.

*****

# మహో మనీషి మా మామ

**డా॥ లక్ష్మి శర్మ**

సెల్ : 9490081905

నాకు నాలుగు నెలల వయసప్పటి నుండి వారికి నేను తెలుసు. నాకు ఊహ తెలిసినప్పటి నుండి వారు నాకు తెలుసు. ఎదురెదురు ఇళ్ళలో ఉండేవారం. అది మా పెద్దవాళ్ళ తరం. మళ్ళీ చిన్నతరం అంటే మహాదేవశాస్త్రిగారి పెద్దబ్బాయి రామక్రిష్ణ అన్నావాళ్ళు మేము ఇప్పుడు ఎదురెదురు ఇళ్ళలో ఉంటున్నాం. మామ ఏంటి, మామ కొడుకు అన్న ఏంటి, అంటే అదంతే ! అలా అలవాటయ్యింది. నేనంటే చిన్నప్పటి నుంచీ తెలుసు, అభిమానం ఉండటం సహజం. నా పెళ్ళయ్యాక మా శ్రీవారితో కూడా వారు ఎంతో ప్రేమగా ఉండటం అభిమానించడం వారి మంచితనం, మా అదృష్టం. ఒకరికి ఒకరుగా మా ఇద్దరి కుటుంబాలు కష్ట సుఖాల్లో చేదోడువాదోడుగా ఉంటుంటాం. మాకు వారి ఇంటి ఎదురుగా స్థలం చూపించింది కూడా మా వదినే (శాస్త్రిగారి పెద్దకోడలు) కాలనీలో అందరూ మేము స్వంత వదినా మరదళ్ళనే అనుకుంటుంటారు. దేవుడికి సేవచేస్తున్నాననే భావనతోనే తమ మామగారితో మెలుగుతుండేది. అదీ వారిద్దరి అనుబంధం.

స్వతహాగా ఆయన మితభాషి, కానీ భాషాశాస్త్రాలకి సంభందించిన విషయాలు ప్రస్తావనకు వస్తే ఆయన భాషణం అమితం. ఎంతో మృదుమాటలతో అందరినీ ఆకట్టుకొనే తత్వం ఆయనది. ఆయన వయస్సురీత్యా కొంత అనారోగ్యానికి గురైనప్పుడు హాస్పిటల్‌లో ఆయన్ని చూడటానికి, నేను, మా వారు వెళ్ళాం. నన్నుచూసి ఆవిడ ఎవరు ? అని మావారిని అడిగారు. నేను ఒకింత నొచ్చుకున్నాను. నన్ను గుర్తుపట్టలేదని కాదు ఈయన రోజూ చూస్తూ నన్ను గుర్తుపట్టలేదా, ఏంటి వీరి పరిస్థితి ? అని. కానీ ఆయన ఆ తర్వాత చాలా కాలం ఆరోగ్యంగానే ఉన్నారు. వెంటనే సర్దుకొని సీతారాముల్లాగా వచ్చారు. లవకుశలే ఆలస్యం అన్నారు. ఆయన ఆశీర్వాద బలంతో మేము సంతానవంతులమవుతామనే నమ్మకం కలుగుతోంది.

ఆయన అనంతపురం నుంచి చిన్నబ్బాయి దగ్గరకు వెళుతున్నప్పుడు మా ఇంటికి వచ్చారు. చిన్నపిల్లవాడిలాగా వాకర్‌తో ఇల్లంతా గిరగిరా తిరిగి ఎంతో సంతోషించారు. మా అమ్మగారుకొన్ని అలంకరణ వస్తువులు నాకు బహుమతిగా ఇచ్చారు. నీలో మీ అమ్మ కనిపిస్తోంది. ఇల్లంతా పచ్చగా అలంకరించావు. పదికాలాలు పచ్చగా ఉండాలి అంటూ ఆత్మీయమైన ఆశీర్వదం మాకిచ్చారు. అది నేనెప్పటికీ మర్చిపోలేని జ్ఞాపకం.

మామ వయసురీత్యా అరవైఏళ్ళకు రిటైర్ అయ్యారు. రిటైర్ అయిన వారు చాదస్తంగా ఇంట్లో ఉండేవారిని విసిగిస్తారని అందరూ అంటుంటారు. కానీ మా మామ అన్ని రకాలుగా రిటైర్ అయ్యారు. ఎవరినీ ఇబ్బంది పెట్టేవారు కాదు. ఆయన ఎవరినీ ఒక్కమాట కూడా పరుషంగా మాట్లాడేవారు కాదు. ఇవి అన్న, వదిన మాతో పంచుకున్న విషయాలు.

ఆయనకు ఆరోగ్యం బాగాలేదని తెలిసి తిరుపతి వెళ్ళి చూడాలని అనుకుని తిరుపతి ప్రయాణం పెట్టుకున్నాము. కానీ అంతలోనే వారు పోవడం అనంతపురం తీసుకురావడం జరిగాయి. నేను ఆయన పార్థివదేహాన్ని చూడలేకపోయాను. అయినా నాకు బాధ అనిపించలేదు. ఎందుకంటే నేను ఆ దృశ్యాన్ని చూస్తే ఆయన లేరని నమ్మాలి. నేను చూడలేదు కాబట్టి నా దృష్టిలో ఆయన సజీవి, అమరజీవి. అంతకుమించి ఆయన స్వభావరీత్యా, సాహిత్యజ్ఞానరీత్యా గొప్ప మనిషి. అదే అదే మా మామ మహో మనీషి.

*****

# కోరాడ మహాదేవశాస్త్రిగారు

**డా॥ శలాక (సూరి) లలిత**

సెల్ : 98480 60579

కోరాడ మహాదేవశాస్త్రిగారి కుటుంబంతో అనడం కంటే అత్త, మామ, విజయ అక్క, రామకృష్ణ అన్న, రమణ అన్న, సూరి అన్న అంటే దగ్గరగా, ఆత్మీయంగా అనిపిస్తుంది. మేము ఐదుగురు అక్క చెల్లెళ్లం. వారి ఎదురుగా ఉన్న ఇంట్లో ఉన్నప్పుడు విజయ అక్క మాకు చిన్న చిన్న పాటలు నేర్పేది. వాటిలో నాకు బాగా గుర్తు ఉన్నది 'కోడి ఒక కోనలో పుంజు ఒక కోనలో', 'తేనెల తేటల మాటలతో', 'ఒంటిగా ఊయ్యాలలూగితినా' మొదలగు పాటలు నేర్పేది. ఇప్పటికి ఆ పాటలు మాకు గుర్తె. అట్ల తదియ, ఉండ్రాళ్ళ తదియ రోజులలో తెల్లవారుజామున లేచి గోంగూర పచ్చడి, పెరుగుఅన్నం తిని, ముందు రోజు గోరింటాకు పెట్టుకుని, ఉయ్యాలలూగి, క్యాంపస్ అంతా తిరుగుతూ కబుర్లు చెప్పుకునేవాళ్ళం. అప్పుడే ఒకసారి అక్క మాకు 'మెకన్నాస్‌గోల్డ్' సినిమా కథ చెప్పింది. నా పెళ్ళి అయిన తరువాత హైదరాబాద్‌లో ఆ సినిమా చూశాను. అక్క చెప్పిన ఆ కథ నా చెవులలో ఇప్పటికీ వినిపిస్తూనే ఉంది. రమణ అన్న, సూరి అన్న ఎక్కువగా అనంతపురంలో ఉండకపోవడంతో అంత సామీప్యం లేదు. ఇక రామకృష్ణ అన్న, మా అన్నయ్య ఒక వయసువారు కావడంతో ఇప్పుడున్నంత చనువు ఉండేది కాదు. అత్త ఇంట్లో అమ్మకు ఏ అవసరం వచ్చినా తల్లిలా ఆదుకునేవారు. మామను గురించి వ్రాయమంటే ఇంట్లో మిగిలిన అందర్ని గురించీ వ్రాస్తున్నాను అనుకుంటున్నారా ? ఏం చేయను ? అప్పుడు మామతో మాకంత చనువు లేదు.

నా పెళ్లి జరిగి నేను హైదరాబాద్ వచ్చిన తరువాత నేను ఎం.ఏ. చేస్తున్నప్పుడు లింగ్విస్టిక్స్ పాఠం చెబుతూ, కోరాడ మహాదేవశాస్త్రిగారిని గురించి చెప్పేవారు. అప్పుడు కాని వారి గొప్పతనం నా అజ్ఞానంవల్ల తెలుసుకోలేకపోయాను. తరువాత నేను పిహెచ్.డి. చేస్తున్నప్పుడు తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయంలో విషయసేకరణకు వెడుతూ ఉండేదానిని. ఒకసారి మామ అక్కడ చదువుకుంటూ కనిపించారు. వెళ్ళి పలకరించగానే ఎంతో ప్రేమగా బదులు పలికారు. ఎందుకు వచ్చావు, ఏ విషయం గురించి వెదుకుతున్నావు అని అడిగారు. ఇంకా ఏ పుస్తకాలు చదవాలో సూచించారు. ఆ రోజు నాకు ఏదో ఘనకార్యం సాధించినంత ఆనందం కలిగింది. అప్పటి నుంచీ అవకాశం దొరికినప్పుడల్లా వారిని కలిసేదాన్ని. అనంతపురం వెళ్ళినప్పుడు ఇంటికి వెళితే కూర్చుని ఏదో ఒకటి మాట్లాడేవారు. వారికి శివానంద ఛారిటబుల్ ట్రస్ట్ పురస్కారం వచ్చినపుడు హైదరాబాద్‌లో కలిశాను. నాన్నగారి సప్తతికి నాన్నకి తెలియకుండా ఒక పుస్తకం బహుమతిగా ఇవ్వాలని నాన్న గురువుల దగ్గర్నుంచి స్నేహితులు, అందుబాటులో ఉన్న శిష్యులు, బంధువులు అందరి అభిప్రాయాలు సేకరించాను. మద్రాసులో ఉండగా ఫోను చేసి మాట్లాడాను. ఎంతో సంతోషంతో వారి సందేశాన్ని పంపడమేకాక, ఆశీర్వదించారు. పుస్తకం చూసి మురిసిపోయారు.

మహాభారతం ప్రాజెక్ట్‌లో పనిచేస్తున్నానని తెలిసి నాన్నగారి మార్గంలో నడవడం చాలా ఆనందం కలిగిస్తోందని మురిసిపోయారు. వారి మనుమరాలు పెళ్లిలో మా ఇద్దరి చెల్లెళ్ళను చూసి అయిదుగురునీ చూడాలని ఉందని అన్నారు. ఆ కోరిక మేము తీర్చలేకపోయాము. అంతటి గొప్ప వ్యక్తిని మామ అని అభిమానంగా పిలవగలగటమే మా అదృష్టంగా భావిస్తున్నాము.

*****

శ్రీ ప్రసాదరాయ కులపతిగారు నాన్నగారికి కనకాభిషేకం చేస్తున్న సందర్భంలో












శ్రీ ఎల్.వి. సుబ్రమణ్యంగారు నాన్నగారిని సన్మానిస్తూ



'పరిశోధకాగ్రగణ్య' బిరుదు ప్రదానోత్సవంలో

# On Remembering Prof. K. Mahadeva Sastri

**Prof. Dr. G.K. Panikkar**
ISDL, Thiruvananthapuram

Prof. K. Mahadeva Sastri was one of the leading figures in the history of Dravidian Linguistics Association. When the *First All India Conference of Dravidian Linguists* (03.06.1971) was held in Trivandrum, many scholars both from India and abroad participated. They felt that the study on the Dravidian family of languages is a much neglected area. Researches on this group of languages have immense potential to bring to light much valuable information hitherto unknown to the linguists, historians and cultural anthropologists. Consequently, Prof. V.I. Subramoniam mooted the idea of forming an association devoted to the cause of Dravidian Studies. Prof. Mahadeva Sastri and Prof. R.C. Hiremath wholeheartedly supported this idea. Thus an 'Appeal', signed by Prof. V.I. Subramoniam, Prof. R.C. Hiremath and Prof. K. Mahadeva Sastri, explaining the need for establishing an association to encourage the study and research on Dravidian Linguistics, was sent to all prominent Indian and foreign linguists. It was also sent to the language departments of the Universities and Colleges of South India. In response, astonishing support was received to this appeal from scholars, students and even from the general public. Having been inspired by the overwhelming support and encouragement, the Dravidian Linguistics Association of India (DLA) was formed, initially with the following seven members: Dr. V.I. Subramoniam, Dr. R.C. Hiremath, Dr. K. Mahadeva Sastri, Dr. Puthusseri Ramachandran, Dr. G.K. Panikkar, Dr. D.V. Veerasamy and Dr. N. Sivaramamurthi. This Association was officially registered on 13.08.1971 for which Dr. Mahadeva Sastri was one of the three Founding-Secretaries, the other two being Dr. V.I. Subramoniam and Dr. R.C. Hiremath. Dr. Sastri was the Secretary in charge of Andhra Pradesh region. Prof. Mahadeva Sastri continued as the Secretaryof DLA up to June 1974. From 1974 June to 1976 June, he served the Dravidian Linguistics Association as its Vice-President. During 1976-1977, he was the President of the DLA. The establishment of the International School of Dravidian Linguistics (18-02-1977), an academic institution sponsored by the DLA, was done while he was the President of the Dravidian Linguistics Association. He could be very happy since that institution had achieved international recognition and had grown to such a level that it is now considered as one of the most reputed centres of Dravidian studies both in India and abroad.

Prof. Mahadeva Sastri used to visit the DLA and ISDL offices for getting personal knowledge on their functioning. As long as he was healthy, he was an active participant in the DLA conferences (*All India Conference of Dravidian Linguists*). The *15th All India Conference of Dravidian Linguists* organized by the DLA in collaboration with Sri Venkiteswara University Centre, Anantapur in 1987 under the leadership of Prof. K. Mahadeva Sastri was a clear proof for his organizing capacity. The attachment of Prof. K. Mahadeva Sastri towards DLA and ISDL was so intense that he became an inseparable part of both Dravidian Linguistics Association and International School of Dravidian Linguistics.

My association with Prof. K. Mahadeva Sastri commenced while he joined in the Department of Linguistics, Annamalai University. I was a student during 1960-1963 studying for M.A. and then as a Research Scholar for about an year. I do not remember when exactly Prof. K. Mahadeva Sastri joined the Department of Linguistics, Annamalai University. I think it was at the end of 1962. Since I was not his student, I did not have any personal contact with Prof. Sastri. I admired him at a distance as a charming, handsome, well-dressed youth who spent most of his office time in the Departmental library by referring books and taking notes. The impression which I had during those days was that Prof. K. Mahadeva Sastri was 'a very serious person'. Later, when I had close association with him as an Office-Bearer of the DLA, I could understand that Prof. K. Mahadeva Sastri was very friendly and jovial. As a person, he was very simple, honest and kind-hearted, and had pleasing manners. He gave support and encouragement to students and researchers and always appreciated the good works done by others. He was an eloquent speaker both in Telugu and English. I had the opportunity to hear his speeches in the DLA conferences and a few lectures at ISDL. He impressed the audience not only due to his mastery over the topic on which he talks but also due to the way of his presentation. In his speeches, he quotes many slokas from Sanskrit and also from Telugu as per the requirement of the context. He has a special ability to present even serious topics with a pinch of humour which enabled him to arrest the attention of the hearers. As a person who had taken D.Litt. under the guidance of Dr. S.K. Chatterjee, the doyen of Indian linguistics, and also got trained under great Professors like T.P. Meenakshisundaram Pillai and Kshitish Chandra Chatterjee. Prof. Mahadeva Sastri was able to make in-depth studies both in the field of linguistics and in the field of Telugu language. I had the experience of understanding his keen interest in academic matters. I had collected some data from the Telugu Chettis of Chalai, Trivandrum. When Prof. Sastri visited ISDL, I just mentioned this matter. Then, he wanted to see that corpus and for that he came along with me to my residence on that day itself. From that data, he has taken some notes. He was very eager to visit that dialect area and hence, on the next day, I had to accompany him to the Telugu Chetti Street so as to enable him to hear the dialect of the Telugu Chettis of Trivandrum.

I respected Prof. K. Mahadeva Sastri as an elder brother. Due to his close association with Prof. V.I. Subramoniam, he was known even to the administrative staff of the ISDL. All of us, including the administrative staff in DLA and IJDL, were grieved by hearing the news of his passing away. So much was his intimacy and affection towards all of us. In addition to his valuable publications, he will be remembered as one of the founder-members of DLA and ISDL as long as these institutions flourish.

*****

# Visionary - Sage - Seer - Rishi

**Dr. Sriram Sonty,** M.D.
Chicago, USA.

***Introduction :***

*Srikalapurna* Prof. Korada Mahadeva Sastry garu is known to me since my entry into Susarla Family of Gopalasastry garu & Seeta Devi garu. My conversations with him were very brief and homely, not much of academic or intellectual in nature. But I came to know of his historical linguistic accomplishments from my wife Sarada Purna, who compiled the book "*Telugu Samskriti - Bhashaa Saaraswathamulu*" in honor of the Brown Puraskar awardee Prof. Mahadeva Sastry. I also happened to contribute an article to the book "*Korada Ramkrishnayya saahiti Neeraajanam*" a *festschrift* in honor of Late Korada Ramkrishanayya during his centenary celebrations which was co-published by Prof. Mahadeva Sastri & Sri Gopalasastry.

Prof Mahadeva Sastry exhibited the three elegant qualities of Scholarship, Literary skills and Linguistic eloquence . I always saw "*Tejas , Varcchas & Medhas*" which are the attributes of an intellectual scholar i.e., *Radiance, Salience & Intelligence.*

Prof. Mahadeva Sastry compiled Mahatma Gandhi's Quotes in the book *"Thus spake Gandhi* "a publication by the Sonty Renaissance International (SRI) Foundation, Flossmoor, Il, USA .

Refering to Prof. Mahadeva Sastri's important work 'Historical Grammar of Telugu' Prof. T. Burrow said "In the course of his work Dr. Mahadeva Sastri has provided a survey of the entire historical development of the Telugu language from the earlier times to the present day, based on a wide selection of the available material. Students of Dravidian Linguistics as well as students of Telugu will be indebted to him".

- T.Burrow. Boden Professor of Sanskrit,
University of Oxford, England

Let us see if Prof Mahadeva Sastri qualifies to be one of the following :

**Visionary –** a person who sees visions, a person who is given to audacious, highly speculative, or impractical ideas or schemes, dreamer.- Webster.

**Sage** - a profoundly wiseman; a man famed for wisdom, A man venerated for his wisdom, judgment, and experience – Webster

**Seer** – a person who prophesies future events; prophet - Webster.

**Rsi – Rishi** - an inspired sage or poet, one of seven of these to whom *Vedas* supposedly were revealed. - Webster/ Monier-williams.

Any person who alone or with others invokes deities in rhythmical speech or song of a sacred character.

Root Word : ***rs*** – to go, ***arsa*** – to flow ***rsa*** – to pierce: ***dris*** – See

Two types of ascetics *Rsi* Type, representative of vedic Aryan thought, which sponsored the Indra worship, recited prayers and performed homa. The *Muni* type which sponsored Rudra-Siva Worship considered prearyan-indigenous, practiced yoga, austerities, and glorified life of renunciation.

- VG Rahurkar

Hinduism, the *Sanatana Dharma* is considered to have existed from all eternity. Its scriptures were revealed through the *Rishis* "Seers" who received them by "Visual Intuition" *(drishti)* from God.

- V. Raghavan.

We may surmise that cosmic processes such as are divined The ***rsis*** in a state of ecstasy or perhaps even ecstasies which is the nearest equivalent of ***Samadhi*** in European culture.

- G. Feuerstein.

There are several traditions associated with the ***Rishis***. according to one tradition there are seven ranks of *rishis*. – ***devarishi, brahmarishi, rajarishi, maharishi, paramarishi, srutarishi*** and ***kandarishi.***

I. *Devarishis* are eternal beings who have simultaneous awareness of all the worlds and have unhindered access to each of them. Narada is an example of a devarishi.

II. *Brahmarishis* are those God-realised souls who utilize their intimate knowledge and consciousness of Brahman for the spiritual welfare of the humanity. Among these are Vyasa, Vasistha, Valmiki and Viswamitra.

III. *Rajarishis* are seers with an integral realization of both the *nirguna* and *saguna* Brahman. – the static and dynamic aspects of the Divine. The great king Janaka is a unique example.

IV. *Maharishis* are seers of eternal truth and an impersonal knowledge embodied in phenomenal existence. They are pilgrim souls on the path of dynamic Truth. Kanwa belongs to this category.

V. *Paramarishis* are who enjoy the status of the greatest Gods in the areas of their special pursuits. The prajapatis – Daksha, Pulastya, Pulaha, Atri, Marichi, Kartee, Angira, Gautama, Cyavana, Kadru , Kashyapa and Dadhici belong to this rank.

VI. The *Srutarishis* by themselves do not have any of the Vedic realizations. They are the initiates in the Vedic lore and have knowledge of the Vedas. Yaska and Sayana are examples of this category.

VII. The *Kandarishis* are those who do not have any inner realization or a mental knowledge of the findings of the Vedas. Being drawn towards them they practise severe austerities and survive on fruits and roots. They are novices to Vedic lore preparing themselves on the Spiritual path in a physical way.

The Vedas, the Puranas and the Epics also speak of Seven Rishis. These rishis embody the all-illuminating,all-manifesting seven thoughts of the Veda – the Seven streams of consciousness into which the Supreme cast forth. They are Viswamitra, Vasistha, Gautama, Bharadvaja, Jamadagni, Kasyapa and Atri. Among the other seer-composers are Agastya, Angirasa, Atharvan, Bhrigu, Dhirgatamas, Kutsa, Medhatithi Kanwa, Parasara, Sunahashepa, and Ushanas.

The Rig-veda refers to rishis as God-born, *devaja.* The satapatha Brahmana and Brihadaranyaka Upanishad demonstrates the identity of the Seven Rishis as the *Pranas:*

*"these two ears are Gautama and Bharadvaja, these Two eyes are Viswamitra and Jamadagni , these two nostrils are Vasistha and Kasyap and the mouth is Atri"*

The Atharva-veda also mentions them as : *"Sad yama eka ekajah"*

The epics and Puranas have a different set of Seven Rishis The Srauta Sutras mention the Rishis of different Gotras and Pravara as Viswamitra, Jamadagni, Bharadvaja, Gautama, Kasyapa, Vasistha and Atri. Agastya as the Eighth. The Puranic list has Marici, Atri, Angirasa, Pulastya, Pulaha, Kratu and Vasistha and the Many others. Alternate names for these rishis were Aristanemi – Kasyapa, Gadhija-Viswamitra, Rukaputra-Jamadagni, Apava-Vasistah, and Angirasa-Bharadvaja.

The Vishnu Purana speaks of Nine Rishis ; Marici, Bhrigu, Anigiras, Pulastya,

Pulaha, Kratu, Daksha, Atri and Vasistha. The Seven rishas of Ramayana are Vasistha, Kasyapa, Atri, Viswamitra, Gautama, Jamadagni, and Bhardavaja. The Mahabharata speaks of Bharadvaja, Kasyapa, Gautama, Viswamitra, Jamadagni, Vasistha and Atri And also Marici, Angirasa, Pulastya,Pulaha, Kratu, Daksha and others. The Fourteen *manvantaras* had as rishis Marici, Atri, Angirasa, Pulastya, Pulaha, Kratu and Vasistah for the First *manvantara*. And the present *Vaivasvata manvantara* has Viswamitra, Jamadagni, Bharadvaja, Gautama, Atri, Vasistha and Kasyapa as its rishis.

The rishis are the *Vedakrits, Vedavids* and *Vedacaryas,* Namely makers, knowers and masters of the Vedas. Through yajna and tapas the rishis are believed to attain a higher status, a station in the sky as the Ursa major. The *Mahabharata* identifies the rishis with *Surya* (Sun) and *Agni* (Fire). The mahabharata speaks of the rishis as the creators and sustainers of the three worlds: *" Trailokyabhuvanah, trin lokan dharayanti, lokasya santana karah".*

Brahma is the creative life-force of the Divine, as well as "the principle of Dynamic growth and expansion" He is the one beyond the Seven rishis:

*"sapta rsimpara ekam ahuh"*

*The **Rishis** and the **Brahma** are of the same nature in so far as they create and increase through the dynamic radiance of their **Tapas.***
***"The rishis and devas together increase the Consciousness content of the Cosmos***"

I would like to conclude that Prof Mahadeva Sastri garu is a Rishi , a Maharishi sharing his Linguistic wisdom with the seekers of truth through linguistic expeditions and experiments.

*"Aum shanti shanthi shantihi"*

✻✻✻✻✻

# Bava - A True Karma Yogi

**Dr. Khandavilli Durga Prasada Rao**
Cell : 9573739879

Everyone knows Prof. Korada Mahadeva Sastry garu as an accomplished scholar, distinguished teacher, committed researcher and a well-known Indologist. But only a few can claim to know him as a family man,and as an individual. As my eldest sister's husband he was the first "outsider" to enter into the Khandavilli family. I can claim to have a few glimpses of his personality; and some of those traits drew my attention in my childhood!

Mahadeva bava used to visit us in our ancestral family home in Munganda mostly during summer vacations; though these were fewer and far between. The visits always had an awe around him as he came from a large city (Chennai) and we lived in Munganda, a remote agraharam. As children we would eye him in wonder as he brushed with toothpaste; all we knew was neem sticks for cleaning teeth.

Like his visits, bava's conversations also were brief and always to the point. The short term visits and reticent dialogues helped create a scholarly aura around bava making everyone eager to surround him and listen to his exchanges. This kind of respect accorded to him by one and all had a profound impact on me; inspired me to pursue education earnestly. I, a school-going child then, was convinced that only scholarly pursuits can bring in social recognition and respectability to individuals.

I once again met bava, after a long interval, sometime in 1978/79 upon his return from Germany. Until that date, I associated bava with books and more books and not with money matters. According to bava, "any printed word is worth reading" and he would read a variety of books including children's novels of my son who was all of 10 years of age at that time. Having gone as a visiting Professor for 2 years with handsome remuneration in German Marks, bava faced the prospects of having to pay substantial income tax. At around the same time, I returned from US and faced similar situation. Bava stayed with me to sort out his tax issues. For the first time, I found bava concerned about money matters, an unusual sight. Bava's happiness knew no bounds when we could come up with legal tax deductions-all of it through self-research only.

My interactions with bava grew after he retired and settled down in Ananthapur. By that time, I also diversified in my intellectual interests and our discussions ranged on diverse issues – politics, finances, cinema and relatives were conspicuously absent in our discussions. I found bava'stransition from a reticent communicator to an engaged conversationalist. During this period, bava appealed to me as "Karmayogi." In spite of adding years, he could sit for hours on end reading and writing scholarly pieces oblivious to his surroundings.

My last interaction with Bava was in March 2016 in Tirupati. I carried a book on Taitteriya Upanishad that I bought in Tirupati railway station. Bava was at that time writing a piece on Upanishads and I cherish the discussion I had with him on Seekshavalli. There was a complete personality transformation in bava – he became a very warm, emotional and affectionate individual. He would hold my hand with childlike grip and ask me for small things like Xeroxing of some pages etc. From a man of few words he suddenly became an incessant talker. When I gave him the Taitteriya Upanishad book, he was delighted as a child would upon acquiring a new toy. Bava came up to the lift to see us off inspite of his failing health. This affectionate gesture of Bava will be always with us as an honour for me and Vijaya. My heart filled with joy and we departed with tears in our eyes.

Little did I know that it was going to be my last meeting with him!

He left all of us on October11, 2016

*****

# Sri K. Mahadeva Sastri

**Korada Nageswara Sastry**

Tel : 08856-236873

Korada family living in Triplicane, Madras, spent the early 1940's in a peaceful, pleasant and calm atmosphere. We did not know what sorrow was. Our studies, our school, our college filled the time.

Father K.Ramakrishnaiah, Reader and Head of the Dept. of Telugu, Madras University went to office in a rickshaw and came back home walking the half kilometer distance.

My elder brothers Ramachandra sastri and Mahadeva sastri studied in Presidency college. Sister Sita went to Wellingdon school for girls. Only studies occupied our time.

My brother Mahadeva Sastri, in the beginning made me join an English medium school in Triplicane, in seventh class. After completing 10$^{th}$, I joined Loyala College, Madras.

These Institutions enabled me to get a good knowledge of English. In later years, this helped me to attain fluency in English. Mahadeva Sastri encouraged and guided me to speak and write good English.

After his return from Germany Mahadeva Sastri told me about Spoken English classes and coaching students in picking up a good standard in communication skills. This was instrumental in my continued pursuit in imparting good English to students. In those days, spoken English classes and coaching by a teacher were unknown.

The book written by Mahadeva Sastri about teaching Telugu through English to Germans in Koln, was quite helpful to me to get a sense of direction for conveying a result oriented coaching to students here.

Till date, I continue on that line to deliver what job-seekers are looking for to fulfill their language needs.

For this, I ever remain grateful to my brother Mahadeva Sastri

Whether I am working in a college or school, I conduct classes to teach English to aspiring students. Of late, Engineering students contact me for helping them get success in campus interviews.

Mahadeva Sastri was not only my brother but also a friend, philosopher, guide and teacher. I will always remember his words of support and encouragement in my life.

My pranams to Mahadeva Sastri.

*****

# Nanna thatha

**Dr. Bharadhwaj Kolipakkam**
Cell : 0018572108990

It was a fine sunny day in Philadelphia and I was home from my observership. I got a call from India to learn that Nanna thatha (I called him so) had passed away. It was a SHOCK. It seemed that I was not there when I was needed the most, despite being around him all my life. I was overwhelmed with grief and disbelief. When it all finally sunk in, paradoxically I was relieved... He had a peaceful death after a short course of illness. The physician in me realized that very few individuals were blessed with such a swift, painless demise. In that moment of loneliness I reflected on the special bond we shared, the persona of a loving grand parent which was shown to very few.

As a child, I enjoyed multiple trips to my grandparents home in Triplicane. The close proximity to Parthasarathy Swamy temple enriched my playtime with divine paraphernalia . The Brahmotsavam festival was an annual affair we never missed,even today embraces me with deep nostalgia. My earliest memories date back to learning slokas and listening to extensive puranas from the venerable master storyteller.My grandfather was the first guru, who instilled the importance of shraddha, which has given me the strength to pursue arduous paths in life . His never ending quest for knowledge with unstoppable zeal was most amazing. Despite tamil not being his first language, he learnt Thiruppavai understanding what each verse meant, with its nuances, at the ripe age of 70. Knowledge has no boundaries- so true, he defied barriers of age , language and ego to expand his intellectual capacity . He introduced me to the discipline of reading newspaper and suggested excellent books to improve my vocabulary. Even though they left Madras when I was only 10 yr old, they laid an unshakable edifice of my future.

Thathaya's full scale of achievements dawned on me only during a function in Hyderabad, when he was awarded for his work in literature. I still remember how I was awestruck as the innumerable citations were read. Despite all his achievements, he continued to remain humble. He was a true follower of the Gita, performing his karma relentlessly without any expectations. I have not seen any other human being handle praise and disdain with such equipoise.

When he heard of my admission into medicine, he was extremely happy. He stressed the need for being an ethical and sincere doctor, to give my best in what I do. My education has helped my grandparents in times of their medical needs, giving me at-most satisfaction and purpose. I felt truly special and blessed that he was able to come to my wedding, his blessings were the most valuable gift that I received. Thathayya has always made me feel that I was his favourite.... right from my childhood days when I used go most unwillingly for a haircut to the last time I met him before leaving to United states.

Na jāyate mriyate vā kadachin nāyam bhūtvā bhavitā vā na bhūyah

ajo nityah shāshvato yaṁ purāno na hanyate hanyamāne sharīre.

This verse recited by Lord Krishna to Arjuna on the battlefield of Kurukshetra seems particularly relevant to me,at this juncture. Though I will definitely miss his erudite physical presence, his clear voice explaining complex sanskrit verses with precision,I truly believe that there is no end to his atman.I will forever cherish our memories , heed to his pearls of wisdom and follow his footsteps acquiring vast amount of knowledge in my own field. As he departs, he leaves behind a legacy. He will be an inspiration for one and all.

*****

# Memories of Thatha Garu

It is hard to forget some one who gave us so many memories to cherish and remember. Most of our childhood days were spent with thathagaru. The evenings that we spent with him were perhaps the best part of the day. He used to be ready with many stories and many other interesting topics - which ranged far and wide, interesting and informative. But today, we realise they are much more - they are essential values which define one's life.

Thathagaru's life was mostly spent in his research work. Always at work without wasting any time. He used to tell us that we cannot get back the time we have lost, So we must never waste time. This is perhaps one important message which made a lasting impression on us.

We used to maintain a diary and write down all those good things told by thatha garu. To this day we remember the famous lines quoted by him

Don't try to run, don't try to hide,
Don't cover up your feelings inside,
Nothing is solved by running away
Let's face the facts, honesty pays.

We remember how thathagaru laid a special emphasis on developing healthy habits. He had the peculiar habit of cutting the news items on health tips and maintain a file. The healthy habits and the eating habits that we follow today are essentially due to him. We are fortunate to be able to see him during his last days. More satisfying is the fact that Twisha (my daughter, his great grand daughter) could get his blessings along with nayanamma's. Thathagaru lived a complete life, a life of peace and contentment, full of love and guided by knowledge. He forever remains our inspiration.

**Ramya**
Cell : 0014697139048

**Keerthi**
Cell : 9701560800

When I close my eyes and think of Thathaiyya, I see two things that were characteristic of our every meeting—the ever-persisting smile on his lips, and his endless enthusiasm for and encouragement of my pursuits. These dual characteristics of our family's patriarch have shaped Korada minds and hearts, past and present.

Thathaiyya gave me a few things to treasure lifelong. Among them, the faith that I can do anything I put my mind to. A powerful message from someone who had achieved so much, so humbly, in his own time. He forged his own path of taking the Telugu language beyond the nation's borders. He instilled a love of learning in all his children and grandchildren, apparent in our pursuits and demeanors to this day.

His was an exemplary life, and one such exemplary trait of his was to give without asking in return, and receiving bountifully as a result. An attitude that defies logic in today's society yet I know holds true. Thathaiyya lived a long, healthy, beautiful, simple life loved by those around him and his memory will be treasured for years to come.

**- Sruthi**

Cell : 9986992692

# అక్షర వైజయంతిక

**ఆచార్య ఎం. బుద్దన్న**
సెల్ : **9603808958**

సారెసారె కమృతధారలే నీ వచ
స్సారమునకు లొంగి జారిపోవు !
కోరికోరి గుల్బహారులే దరహాస
పర్వములకు నాంది పలికిపోవు !

నీ మనస్సులోన నీహారములసోన
కురిసిపోని లిప్తకూడ లేదు !
సువచనములలోన నవనీత మంథాన
మధురవృత్తికెపుడు మత్తురాదు !

మమతపేర గుండె కమతాన శతశీత
పర్వతములె కరగి పారునేమొ !
సమతపేర ధరణి చక్రమే చక చక
పచ్చదనము లొలికి పండునేమొ !

ఎదుటి బ్రదుకులోని ముదురు చీకటినెల్ల
సతము ఖతము సేయు వ్రతము నీది !
తనువు నిచ్చుకొన్న ఘనుడు దధీచికే
జీవధారలొలుకు చేయి నీది !

జగతిలోన ప్రేమచక్షువే నశియింప
తృప్తిగానకున్న తెన్నులెన్నొ !
స్వచ్ఛమైన ప్రేమ గుచ్ఛమ్ము లిచ్చు నీ
కనులలో ప్రశాంతవను లవెన్నో !

పదవిలోన మధురహృదయమే పదవిగా
ఛాత్రలోకమేల జాలినావు !
పదవి వదలి శిష్యహృదయసీమలలోన
స్మృతివసంతములను చిలికినావు !

కల్లకపటములకు గల్ల చపేటమ్ము
వాతపెట్టుటే రివాజు నీకు !
అనుభవాలతోడ మనువాడుకొను గుప్త
తత్త్వహేల ప్రాణధార నీకు !

సితయశస్సముల్లసిత మహోన్నతమైన
గుణజగత్తు నేలుకొంటివీవు !
శతవసంతకాలగత మహాదేవుడే
జీవుడైన ధన్యజీవివీవు !

# రథబంధ పద్యం

**డా॥ ఆశావాది ప్రకాశరావు**

సెల్ : **9440488600**

ఆచార్య పదవీ సమంచితులైన సందర్భంలో డా॥ కోరాడ మహాదేవశాస్త్రికి శిష్యుడు ఆశావాది ప్రకాశరావు సమర్పించిన రథబంధ పద్యం.

**శ్రీశాం! కోమలసారాంగ ! శివద ! మృడ ను**
**త గుణ! మద్గురు మనుపుము దయవహించి**
**హరిహయానుజ! దేవదేవా! ముకుంద!**
**పావనాభిఖ్య! శాస్త్రార్థ భస్త్రి! శౌరి !**

ఇందులో ఆచార్య కోరాడ మహాదేవశాస్త్రి పేరు ఉన్నది కాని అది తెలిసికోవాలంటే రథబంధ చిత్రాన్ని గీసికోవలసిందే.



# మా మంచి మాష్టారు ఆచార్య 'కోరాడ'

**ఆచార్య రాచపాళెం చంద్రశేఖర్‌రెడ్డి**

సెల్ : **9440222117**

ఆచార్య కోరాడ మహదేవశాస్త్రిగారికి నేను మొదట విద్యార్థిని, తర్వాత సహాధ్యాపకుడిని. 1967 జులైలో నేను తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో బి.ఎ. కోర్సులో చేరాను. అప్పట్లో విశ్వవిద్యాలయం ప్రాంగణంలోనే అండర్ గ్రాడ్యుయేట్ కోర్సులు కూడా ఉండేవి. నేను చరిత్ర, తత్వశాస్త్రం, తెలుగు గ్రూపులో చేరాను. నాతోపాటు నాగపట్ల భక్తవత్సలరెడ్డి, అల్లాడి వెంకటాద్రి, ఎం.రాజారెడ్డి, గురప్పనాయుడు, కె. హరినాథ్, విశ్వనాథరెడ్డి, ఆర్.సి. నాగేశ్వరరావు, రోహిణి, శ్రీహరి, శ్రీహరిరావు మొదలైన ఇరవై మంది ఆ గ్రూపులో చేరాం. నాగేశ్వరరావు కొన్ని నెలలు మాత్రమే ఉండి తర్వాత ఎ.జి.బి.ఎస్సీ కోర్సులో చేరాడు. మాకు మొదట సంవత్సరంలో మహదేవశాస్త్రిగారు స్పెషల్ తెలుగులో బాలవ్యాకరణం బోధించారు. అందమైన ముఖం, ఉంగరాలజుట్టు, టక్, మృదువైన కంఠస్వరం, ఆసక్తికరమైన బోధన– ఇవీ ఆయనలో మేము గమనించిన అంశాలు. ఆయన వ్యాకరణాన్ని చాలా సులభంగా అర్థమయ్యేట్లు బోధించారు. ఆయితే ఆయనతో మాకు తరగతిలోనే సంబంధం - బయట గురువులను కలవాలంటే భయం. పైగా మొదటి సంవత్సరం విద్యార్థులంకదా ! నా స్నేహితుడు ఆర్.సి. నాగేశ్వరరావు సార్ బోధనా పద్ధతిని గురించి, ఆయన ఉచ్చారణ గురించి వ్యక్తిగత చర్చల్లో తమాషాగా మాట్లాడేవాడు. అయితే ఆ మాటల్లో గౌరవము ధ్వనించేది. సార్ గొంతు మృదువుగా ఉంటుంది. మాటలు లయాత్మకంగా బయటికి వచ్చేవి. పాఠం చెబుతూ చెబుతూ ఆంగ్లంలోకి మారేవారు. అది మరీ లయాత్మకంగా ఉండేది.

మొదటి సంవత్సరం పూర్తయింది. 1968 జూన్‌లో రెండవ సంవత్సరం. కాని సార్ క్లాసుకు రాలేదు. సార్ ఏమయ్యారనుకుంటూంటే అప్పుడే అనంతపురంలో పి.జి.సెంటర్ ప్రారంభించారని, సార్ అక్కడికి ప్రమోషన్ మీద వెళ్ళారని తెలిసింది. ఆ యేడాదే మా తెలుగు శాఖాధ్యక్షులు ఆచార్య జి.ఎన్.రెడ్డిగారికి పెండ్లి అయిందని కూడా తెలిసింది. ఆయన అనంతపురం అల్లుడు.

అంతే 1976 ఫిబ్రవరి దాకా మళ్ళీ శాస్త్రిగారిని చూడలేదు. నా పరిశోధన మార్గదర్శకులు ఆచార్య తుమ్మపూడి కోటేశ్వరరావుగారు, ఆయన 1975లో రీడర్‌గా అనంతపురంలో సెంటరుకు వచ్చారు. నేను 1976 ఫిబ్రవరిలో పరిశోధన పనిమీద అనంతపురం వచ్చాను. అప్పుడొక విచిత్రమైన సంఘటన జరిగింది.

ఆ సమయంలో ఆచార్య సచ్చిదానందమూర్తిగారు వైస్ ఛాన్సలర్‌గా అనంతపురం పి.జి. సెంటర్‌ను సందర్శించారు. బ్రహ్మశ్రీ శాస్త్రిగారు అప్పుడు స్పెషల్ ఆఫీసర్‌గా ఉన్నారనుకుంటాను. నేను వచ్చి తెలుగు శాఖ క్లర్క్ కూర్చునే చోట వచ్చి కూర్చున్నాను. తుమ్మపూడి వారు ఇంకా శాఖ మారలేదు. ఇంతలో శాస్త్రగారు వచ్చారు. ఫుల్ సూట్‌లో ఉన్నారు. నేను లేచి నిలబడ్డాను. ఆయన గమనించకుండా గది లోపలికి వెళ్ళారు. కాసేపటికి మళ్ళీ బయటికి వెళ్ళారు. అప్పుడూ లేచి నిలబడ్డాను. అలా రెండు వరుసలు అయ్యింది. మూడోసారి ఆయన నన్ను గమనించారు. నాకు ఆయన మా గురువని తెలుసు. కానీ ఆయనకు నేను విద్యార్థినని తెలియదు. ఒక్కసారి నన్ను చూచి Who are you here ? అని అన్నారు. నేను జడుసుకున్నాను. పరిశోధక విద్యార్థిని, తిరుపతి నుండి వచ్చానుసార్ అన్నాను. How is it ? Its funny. How are you here without my knowledge ? అన్నారు. ఆయన పక్కనే ఉన్న తన ఛాంబర్‌లోకి వెళ్ళారు. నేను వెనుకనే వెళ్ళాను. You meet me tomorrow, not today. అన్నారు. మర్నాడు తుమ్మపూడివారు నన్ను తీసుకునిపోయి శాస్త్రిగారికి పరిచయం చేశారు. నేను ఆయన పాత విద్యార్థినని తెలిసి సంతోషించారు. నేను అక్కడ కొన్ని రోజులు ఉండి తిరుపతికి వచ్చేశాను. శాస్త్రిగారు తర్వాత పశ్చిమ జర్మనీకి వెళ్ళారు.

1977 ఆగస్టు చివర్లో నేను నా మిత్రుడు పి.ఎల్. శ్రీనివాసరెడ్డి తెలుగు శాఖలో లెక్చరర్లుగా చేరాం. మేము చేరినప్పటికి శాస్త్రిగారు జర్మనీలో ఉన్నారు. తర్వాత తిరిగి వచ్చారు. వారి అధ్యక్షతన నేను అధ్యాపకుడుగా పని చేశాను. కొన్ని పర్యాయాలు తిరుపతి సంగతులు మాట్లాడుకున్నాం. రెండవ ప్రపంచ తెలుగు మహాసభలకు శాస్త్రిగారు కౌలాలంపూర్ వెళ్ళివచ్చారు. అలా వెళ్ళివచ్చిన వాళ్ళకు అనంతపురంలోని కృష్ణ కళామందిరంలో సన్మానం జరిగింది. శాస్త్రిగారు ఆ రోజు భాగవతం గురించి చక్కగా మాట్లాడారు. ఆ తర్వాత ఆయన శాఖాధ్యక్షులుగా ఉండగానే లెక్చరర్ పోస్టుకు ఇంటర్వ్యూలు జరిగాయి. ఇంటర్వ్యూ జరిగాక సార్ ముఖం ఒకరకంగా పెట్టుకుని డిపార్ట్‌మెంటుకు వచ్చారు. మధ్యాహ్నం క్లాసుకు వెళ్ళే ముందు సార్‌ను కలుసుకున్నపుడు, ఇంటర్వ్యూకు వచ్చిన వాళ్ళలో ఒక పద్యం కూడా చెప్పలేక పోయిన వాళ్ళమీద విసుక్కున్నారు.

ఒకసారి తెలుగు, ఇంగ్లీషు శాఖల అధ్యాపకులంతా సమావేశమైనప్పుడు శాస్త్రిగారు శబ్దార్థ సంబంధం గురించి ప్రసంగించారు. దానిమీద పెద్ద చర్చే జరిగింది. 1980లో అప్పటి విద్యార్థి నాయకుడు, నేటి సిపిఐ (ఆంధ్రప్రదేశ్) ప్రధాన కార్యదర్శి శ్రీశ్రీగారిని, మాదాల రంగారావుగారిని కళాశాల వార్షికోత్సవానికి పిలుచుకొన్నారు. ఆ సందర్భంగా వారిని శాస్త్రిగారు తెలుగు శాఖకు ఆహ్వానించారు. విద్యార్థులు, ఉపాధ్యాయులు హాజరైన ఆ సభకు శాస్త్రిగారు అధ్యక్షత వహించారు. శ్రీశ్రీగారిని పరిచయం చేస్తూ, ఆయన పాపులారిటీని ప్రస్తావిస్తూ "జగమెరిగిన బ్రాహ్మణునికి జంజెమేల" అన్నారు. అందరూ చప్పట్లు కొట్టారు. శ్రీశ్రీగారు తనకు జంజెం లేదని గుర్తు చేస్తూ నన్నయ్య పద్యాలను కొన్నిటిని అనర్గళంగా ఉదాహరించి ఆధునిక కవితా వైశిష్ట్యాన్ని వివరించారు.

తర్వాత కొన్నాళ్ళకు మాష్టారు ఉద్యోగం విరమణ చేశారు. బయోసైన్సెస్ బ్లాకులో మిద్దెపైన హాలులో వీడ్కోలు సమావేశం జరిపాం. ఆ సభలో అధ్యాపకులందరం మాట్లాడాం. వీడ్కోలు స్వీకర్తగా మాష్టారు మాట్లాడిన మాటలు ఆదర్శప్రాయంగా ఉన్నాయి. ఈ సభలో ఒక ఆర్ద్రమైన సన్నివేశం. అప్పుడు సి. రాధాదేవి అని మా విద్యార్థిని ఉండేది. ఆమె తండ్రి సి. రామకృష్ణారెడ్డిగారని ఆర్ట్స్ కాలేజీలో తెలుగు అధ్యాపకుడుగా పని చేశారు. ఆయన అప్పటికే కన్నుమూశారు. రాధాదేవి సార్‌కు వీడ్కోలు చెబుతూ ఉమ్మడి కుటుంబం సినిమాలో ఎన్.టి.రామారావుగారి ముందు సావిత్రిగా వాణిశ్రీ పాడిన "పోవుచున్నావా ? ఔరా యమధర్మరాజా" అనే పాట బాణీలో "పోవుచున్నావా ? ఔరా మాష్టారూ" అని పాట పాడబోయింది. ఆ చరణం పాడే సమయానికి ఆమెకు ఏడుపు వచ్చి ఏడ్చేసింది. మాష్టారు లేచిపోయి ఆమెను ఓదార్చారు. సభంతా గాంభీర్యం ధరించింది.

ఉద్యోగ విరమణ చేసిన కొన్నాళ్ళలో మాష్టారు తెలుగు శాఖకు వచ్చి వారి నాన్న కోరాడ రామకృష్ణయ్యగారి శతజయంతి సందర్భంగా "ఆంధ్ర భారత కవితా విమర్శనము" అనే పుస్తకం మీద వ్యాసం రాయమన్నారు. నేను రాశాను. శాస్త్రిగారు ఆ వ్యాసాన్ని బాగా ప్రసంశించారు. తర్వాత ఆయనకు అనంతపురంలోని శారదా ఆశ్రమములో సన్మానం జరిగినపుడు కలుసుకున్నాను. చివరగా ఆయన బాగా వృద్ధాప్యంలో ఉన్నపుడు ఇంటికి వెళ్ళి కలిశాను. నాకు కొన్ని పుస్తకాలు బహుకరించారు. తర్వాత ఆయన మరణించినపుడు ఆయన్ని చూడడం.

శాస్త్రిగారి రూపమేగాదు, వ్యక్తిత్వం కూడా నేను తలచుకున్నప్పుడల్లా కళ్ళముందు కదలాడతాయి.

*****

# సౌజన్యానికి మారుపేరు మహాదేవశాస్త్రిగారు

**ఆచార్య ఆర్.వి.ఎస్. సుందరం**

సెల్ : 098440 15759

డా॥ కోరాడ మహాదేవశాస్త్రి భాషాశాస్త్రవేత్త, బహుభాషా పండితుడు. అన్నిటికంటే ఎక్కువగా సౌజన్యానికి మారుపేరు, 1921లో జన్మించి 95 ఏళ్ళు సార్థక జీవితాన్ని గడిపిన శాస్త్రిగారు విజయదశమి పర్వదినాన కీర్తిశేషులయ్యారు. తొమ్మిది పదుల వయస్సు దాటినా సాహిత్యసేవ చేస్తూ, పుస్తకాలు ప్రచురిస్తూ, మిత్రులను, శిష్యులను పలకరిస్తూ గడిపిన మహాదేవశాస్త్రిగారు నేటి యువతరానికి ఆదర్శప్రాయులు.

మహాదేవశాస్త్రిగారి తండ్రి కోరాడ రామకృష్ణయ్యగారు ద్రావిడ భాషాసాహిత్యాలకు చేసిన సేవ చిరస్మరణీయం. వారు నివసించిన మద్రాసు తిరువళిక్కేణిలో, సింగారాచారి వీధిలోని ఇల్లు ఆనాటి పండితులందరికీ పరిచితమే. నేను, నా స్నేహితులు మద్రాసు రాజధాని కళాశాలలో చదివేటప్పుడు (1967-69) అప్పుడప్పుడు ఆ ఇంటికి వెళ్ళి అక్కడే ఉంటున్న ఎల్.బి. శంకరరావుగారిని కలిసేవాళ్ళం. వారి ద్వారానే రామకృష్ణయ్యగారి సారస్వత వ్యాసములు, దక్షిణదేశ భాషా సారస్వతములు - దేశి, సంధి మొదలైన పుస్తకాలు మాకు లభించాయి. ఆ యింట్లోనే కోరాడ మహాదేవశాస్త్రిగారిని కూడా అప్పుడప్పుడు కలిసేవాడిని.

శాస్త్రిగారు తండ్రికి తగ్గ తనయుడు. సంస్కృతం, తెలుగు, ఆంగ్లం మొదలైన భాషల్లో గొప్ప పండితులు. వీరి వంశమే అలాంటిది. పది తరాలకు చెందినవారు నాలుగు వందల సంవత్సరాలు సాహిత్యసేవ చేసిన వంశం. కోరాడ రామచంద్రశాస్త్రి, నాగేశ్వరశాస్త్రి, రామకృష్ణయ్యగారిలాంటి వారు సంస్కృతాంధ్ర సాహిత్యాలకు విశిష్ట సేవలందించారు.

కోరాడ మహాదేవశాస్త్రిగారు చదివింది ఆర్థికశాస్త్రం. ఆరు సంవత్సరాలు ఆర్థిక శాస్త్రవేత్తగా పనిచేసి తర్వాత కలకత్తాలో ఎం.ఏ. కంపారిటివ్ ఫైలాలజి చేశారు. ప్రపంచ ప్రఖ్యాతి చెందిన భాషాశాస్త్రవేత్తలు సునీతి కుమార్ ఛటర్జీ, సుకుమార్‌సేన్ వారి గురువులు. ప్రాచీనాంధ్ర భాషకు సంబంధించిన భాషాశాస్త్రవిషయాన్ని పరిశోధనకు ఎంపిక చేసుకొని 'హిస్టారికల్ గ్రామర్ ఆఫ్ తెలుగు' అనే సిద్ధాంత గ్రంథానికి డి.లిట్. పట్టం పొందిన మొదటి తరం తెలుగు భాషాశాస్త్రవేత్త శాస్త్రిగారు. ఆ తర్వాత తెలుగులోను ఎం.ఏ. చేసి అన్నామలై, శ్రీ వేంకటేశ్వర, శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయాలలో ఆచార్యులుగా పనిచేశారు. శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం ఏర్పడడానికి ముందు స్నాతకోత్తర కేంద్రానికి విశేషాధికారిగా ఉన్నారు. 1976-78లో జర్మనీలోని కొలోన్ విశ్వవిద్యాలయంలో విజిటింగ్ ప్రొఫెసర్‌గా ఉన్నారు. అప్పుడే ఇంగ్లీషు ద్వారా తెలుగు నేర్చుకోవడానికి వీలుగా "ఆధునిక తెలుగు కరదీపిక" (గ్రామర్ అండ్ హ్యాండ్‌బుక్ ఆఫ్ మాడర్న్ తెలుగు) రచించారు.

శాస్త్రిగారి రచనలు విద్యార్థులకు, పరిశోధకులకు, ప్రయోజనకరమైనవి. వారి డి.లిట్. సిద్ధాంతవ్యాసం భాషా శాస్త్రంలో చారిత్రక పద్ధతికి ఒక మైలురాయి. క్రీ.పూ. 200 నుండి క్రీ.శ. 1000 వరకు ప్రాచీన తెలుగుభాషను చారిత్రకంగా విశ్లేషిస్తూ కలకత్తా విశ్వవిద్యాలయానికి శాస్త్రిగారు సమర్పించిన సిద్ధాంతవ్యాసానికి 1961లో డి.లిట్. పట్టం లభించింది. ఈ పుస్తకాన్ని శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం, అనంతపురం స్నాతకోత్తర కేంద్రం 1969లో ప్రచురించింది. సునీతికుమార్ ఛటర్జీ, టి.బర్రో, సుకుమార్‌సేన్ దీనికి పీఠికా ప్రాయమైన అభిప్రాయాలు అందించారు. వెయ్యి సంవత్సరాలకుపైగా వికాసం చెందిన ప్రాచీన తెలుగుభాషాస్వరూపాన్ని విలువైన అనుబంధాలతో సహా ఈ పుస్తకం అందించింది.

1976-78లో శాస్త్రిగారు జర్మనీలోని కోలోన్ విశ్వవిద్యాలయంలో తెలుగు భాషను బోధించారు. విదేశీయులు తెలుగు నేర్చుకోవటానికి శాస్త్రిగారు ఒక వర్ణనాత్మక వ్యాకరణాన్ని రాశారు. దానితోబాటు ఆధునిక తెలుగు భాషా కరదీపిక కూడా అందులో ఉంది. 'డిస్క్రిప్టివ్ గ్రామర్ అండ్ హ్యాండ్‌బుక్ ఆఫ్ మాడర్న్ తెలుగు' ఇది 1985లో జర్మనీలో అచ్చయింది.

మహాదేవశాస్త్రిగారు ప్రచురించిన కరదీపికలో తెలుగు వర్ణమాల, సంధి సూత్రాలు కాక మొత్తం 74 పాఠాలున్నాయి.

నామవాచకం, వచనం, విభక్తి, క్రియలు, సంఖ్యావాచకాలు, సమాసాలు మొదలైన వాటికి సంబంధించిన పాఠాలతోబాటు ప్రతిపాఠానికి అభ్యాసాలు ఉన్నాయి. వాటికి సంబంధించిన సమాధానాలను 'కీ టు లెసన్స్' అనే భాగంలో ఇచ్చారు. అనుబంధంగా ముఖ్యమైన పదాలకు సంబంధించిన లఘుకోశం, పారిభాషిక పదాల సూచి ఉన్నాయి. తెలుగు నేర్చుకోవాలనుకొనే విదేశీయులకు, భాషేతర విద్యార్థులకు, ఇది చాలా ఉపయుక్తమైన గ్రంథం.

కోరాడ మహాదేవశాస్త్రిగారు చేసిన మరొక మంచి పని "ఆంధ్ర వాఙ్మయ పరిచయము" అనే పేరుతో బాలబాలికలు గుర్తుంచుకోవలసిన పద్యాలను సంకలనంగా కూర్చడం. 'సరస్వతీ ప్రచురణము' పేరుతో 60, సింగరాచారి వీధి, మద్రాసు - 5 నుంచి 1985లో ప్రచురితమైన ఈ చిన్ని పుస్తకం బాలబాలికలకు హస్తభూషణంలాంటిది. ఇందులో మూడు భాగాలున్నాయి. మొదటి భాగంలో ఆంధ్రభాషా వాఙ్మయముల వివిధ దశలను గురించిన వివరణ ఉంది. రెండో భాగంలో 'ప్రసిద్ధ పద్యాలు' పేరుతో నన్నయ నుంచి ఆధునికకాలం వరకు గుర్తుంచుకోదగిన పద్యాలున్నాయి. శ్రీనాథుల పద్యాలతోబాటు శతక పద్యాలు, చాటువులు, పద్యనాటకాలలో పద్యాలు, కొన్ని ప్రసిద్ధ గేయాలు ఇందులో ఉన్నాయి. మూడవ భాగంలో ఆంధ్ర వాఙ్మయంతో చారిత్రక సమన్వయం చేశారు. దీనివల్ల తెలుసుకోవలసిన సాహిత్య విషయాలతోబాటు చారిత్రక విషయాలను కూడా పరిచయం చేసినట్లయింది.

'వ్యాకరణ దీపిక', 'తెలుగు దేశ్యవ్యుత్పత్తి నిఘంటువు' మొదలైనవి కూడా శాస్త్రిగారు తెలుగు వారికి అందించిన కానుకలు. 'నన్నెచోడుని కుమారసంభవము' ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురించిన ప్రాచీన గ్రంథం. మానవల్లి రామకృష్ణకవి మొదట వెలుగులోకి తెచ్చిన ఈ గ్రంథాన్ని తర్వాతి కాలంలో పలువురు ముద్రించారు. శాస్త్రిగారి ముద్రణలో విశేషం ఏమిటంటే రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు సూచించిన పాఠాంతరాలను ఇవ్వటం.

కోరాడ మహాదేవశాస్త్రిగారు 93 ఏళ్ళ వయసులో ముద్రించిన అమూల్యగ్రంథం 'భాష - సంస్కృతి'. భాషను గురించి, సంస్కృతిని గురించి ఉన్న విస్తృతమైన అవగాహనకు అద్దంపట్టే గ్రంథమిది. 15-9-2014న స్వహస్తాలతో ప్రేమతో వారు సంతకంతో సహా పంపిన ఈ గ్రంథం వారి భాషా పాండిత్యాన్ని, పరిశోధన పటిమను, సాంస్కృతిక విశ్లేషణను తెలియజేస్తుంది. దీనిలోని విమర్శనాత్మక, పరిశోధనాత్మక వ్యాసాలు ఎన్నో నూతన విషయాలను ఆవిష్కరిస్తాయి.

భాషను గురించిన లఘు వ్యాసాలలో ప్రపంచ భాషలను గురించి, భాషోత్పత్తిని గురించి ఇండో యూరోపియన్ జనులు, వారి భాషలు, ద్రావిడ భాషలు మొదలైన వాటిని గురించి విలువైన సమాచారం ఉంది. సంస్కృతంలో ద్రావిడ ప్రతిదేయ పదాలు, సంస్కృతంలో ఆస్ట్రో - ఏషియాటిక్ పదాలు మొదలైన వాటిని గురించి శాస్త్రిగారు సరళ సుందరంగా వివరాలందించారు.

తెలుగు భాషకు సంబంధించినంతవరకు ఈ పుస్తకంలో విలువైన విషయాలు చాలా ఉన్నాయి. ప్రాచీనాంధ్ర భాషాస్వరూపం, ప్రాచీన, మధ్యయుగ, శాసనపదావళి, తిక్కన రచనలో భాషావిశేషాలు, వైకృత పదావళి, వ్యావహారిక కావ్యశైలీ భేదాలు మొదలైనవన్నీ శాస్త్రిగారి వివేచనలో చోటుచేసుకున్నాయి.

భాషాశాస్త్రానికి సంబంధించిన అనేక విషయాలను సులభమైన భాషలో అందరికీ అర్థమయ్యేట్లు చెప్పటం అందరికీ సాధ్యం కాదు. కాని శాస్త్రిగారు దీన్ని సాధ్యం చేశారు. తెలుగు భాషకు సంబంధించిన విషయాలనే కాకుండా హిందీలో అనునాసికత్వం, లింగవిధానం, వచన విధానం, విభక్తి మొదలైన వాటిని కూడా శాస్త్రిగారు చర్చించారు.

సాహిత్యం, సంస్కృతి, శైలి, సామెతలు - జాతీయాలు మొదలైన వాటిని గురించి కూడా శాస్త్రిగారు తమ పుస్తకంలో విలువైన అభిప్రాయాలను వెలిబుచ్చారు. వయసులో పెద్దవారైనా తమ జ్ఞానాన్ని నలుగురికీ పంచాలనే సదుద్దేశ్యంతో 'భాష - సంస్కృతి' లాంటి పుస్తకాన్ని ప్రచురించిన శాస్త్రిగారు ఎంతైనా అభినందనీయులు.

కోరాడ మహాదేవశాస్త్రిగారు ప్రస్తుత రచయిత వ్యావహారిక భాషలో మొట్టమొదటిసారిగా పరిశోధన చేసి పిహెచ్.డి. పొందిన 'తెలుగు - కన్నడ జానపద గేయాలు' సిద్ధాంత వ్యాసానికి పరీక్షకులు (1973). నాలుగున్నర దశాబ్ధాలకు పైగా వారి అవ్యాజానురాగానికి నోచుకున్న అసంఖ్యాక సాహితీ సేవకులలో ఈ రచయిత కూడా ఒకరు.

*****

# మా మాష్టారు మహాదేవశాస్త్రి

**ప్రాచార్య యల్.బి. శంకరరావు**

**ఫోన్ : 044-28443211**

కోరాడ వంశంవారు ఎనిమిది తరాలుగా తెలుగు సాహిత్యానికి ఎనలేని కృషి చేస్తున్నారు. వీరి తపః ప్రభావంవలన కోరాడవంశంలో తరతరాలుగా పండిత ప్రకాండులు జన్మిస్తున్నారు. వారిలో ఒకరు కోరాడ రామచంద్రశాస్త్రి. వీరు సంస్కృతాంధ్రాల్లో పాండిత్యం గడించి తెలుగులో 'మంజరీమధుకరీయ'మనే ప్రథమ స్వతంత్ర నాటకాన్ని విరచించారు. ఈయన తర్వాత తరంలో కోరాడ నాగేశ్వరశాస్త్రి చెప్పుకోదగ్గ సంస్కృతాంధ్ర పండితుడు.

ఈ వంశంలోనే కోరాడ రామకృష్ణయ్య 1894లో జన్మించారు. ఈయన సంస్కృతాంధ్రాల్లోనే గాకుండా ఆంగ్లంలోనూ పండితుడే. వీరు మద్రాసు విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో రీడరుగా చాలా కాలం పనిచేశారు. వీరితోపాటు పింగళి లక్ష్మీకాంతం పరిశోధకుడుగా కొన్నాళ్లు ఉద్యోగించారు. కోరాడ రామకృష్ణయ్య నన్నెచోడుని కుమారసంభవకావ్యాన్ని శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రితో కలిసి పరిష్కరించగా మద్రాసు విశ్వవిద్యాలయం వారు ప్రచురించారు. ఈ కావ్యానికి రామకృష్ణయ్య ఆంగ్లాంధ్రాల్లో మంచి విలువైన పీఠికల్ని సంతరించారు. గ్రంథాంతంలో కఠిన పదాలకు, కన్నడ, తమిళ పదాలకు అర్థాలిచ్చారు. రామకృష్ణయ్య బహు గ్రంథ రచయిత. ద్రవిడియన్ కాగ్నేట్సు, తెలుగు లాంగ్వేజ్ ఆఫ్ ఫస్టు మిలీనియమ్ ఎ.డి. అనే గ్రంథాల్ని ఆంగ్లంలో రచించారు. ఇంకా వీరు తెలుగులో సంధి, భాషోత్పత్తి క్రమము, సారస్వత వ్యాసాలు, దక్షిణదేశ భాషా సారస్వతాలు – దేశి, ఆంధ్ర భారత కవితావిమర్శనము అనే గ్రంథాల్ని విరచించారు. రామకృష్ణయ్య తిరువళ్ళిక్కేణి 33, సింగరాచారి వీధిలో ఇల్లు కొనుక్కుని అక్కడే కొంత కాలం నివసించారు. బులుసు వెంకటరమణయ్య కొన్నాళ్ళు ఆ ఇంట్లోనే ఒక భాగంలో ఉండేవారు. ఆ గృహం ఆ రోజుల్లో తెలుగు ఆచార్యులందరికీ బాగా పరిచయమైనదే. పేరు పొందిన తెలుగు కవులు, పండితులు, విమర్శకులు ఆ ఇంటిని సందర్శించి ఇష్టాగోష్ఠుల్లో పాల్గొన్నవారే.

అన్నపూర్ణ – రామకృష్ణయ్య దంపతులకు ద్వితీయ కుమారుడుగా మహాదేవశాస్త్రి ఉదయించారు. వీరి పాఠశాల చదువు తిరువళ్ళిక్కేణిలో హిందూ స్కూలులో జరిగింది. మహాదేవశాస్త్రి తండ్రిని మించిన తనయుడు. వీరు సంస్కృతాంధ్రాంగ్లాల్లో నిష్ణాతులు. వీరు మొదట ఆర్థిక శాస్త్రం ఎం.ఏ. చేశారు. పిమ్మట ఢిల్లీలో ఆర్థికశాస్త్రవేత్తగా కొన్నాళ్ళు ఉద్యోగించారు. తండ్రిలాగా తనయుడు కూడా భాషాశాస్త్రవేత్త కావాలని కలకత్తాలో ఎం.ఏ. కంపారిటివ్ ఫైలాలజి చదివించారు. అక్కడ వారి గురువులు సునీతికుమార్ ఛటర్జీ, సుకుమార్ సేనులు. ఛటర్జీ ఇండోయూరోపియన్ ఫైలాలజీలో ఘటికుడు. 'ఆరిజన్ అండ్ డెవలప్‌మెంట్ ఆఫ్ బెంగాలి లాంగ్వేజి' అనే ప్రసిద్ధ భాషాశాస్త్ర గ్రంథాన్ని సంతరించారు.

ఛటర్జీగారి దగ్గర మహాదేవశాస్త్రి ప్రాఙ్నన్నయ యుగ తెలుగు శాసనాలపై పరిశోధించి 1961లో డి.లిట్. డిగ్రీని సాధించారు. ఈ గ్రంథాన్నే 1968లో హిస్టారికల్ గ్రామర్ ఆఫ్ తెలుగు అనే గ్రంథంగా శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం వారు ప్రచురించారు. 1956 ప్రాంతంలో తెలుగు ఎం.ఏ. చేశారు. 1958 ప్రాంతంలో అన్నామలై విశ్వవిద్యాలయం భాషాశాస్త్రశాఖలో రెండు సంవత్సరాలు పనిచేశారు. 1960లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖలో లెక్చరరుగా చేరారు.

1961–1963లో ఈ వ్యాస రచయిత తెలుగు ఎం.ఏ.లో అక్కడ చేరాడు. అప్పుడు మాకు వీరు తెలుగు భాషాచరిత్ర, భాషాశాస్త్రం ఎంతో చక్కగా అందరికీ అర్థమయ్యేటట్లు బోధించేవారు. 1962లో కోరాడ రామకృష్ణయ్య తిరుపతిలోనే పరమపదించారు. మేము ఎం.ఏ. ద్వితీయ సంవత్సరం చదువుతున్నప్పుడు మహాదేవశాస్త్రి నన్నెచోడుని కుమారసంభవ కావ్యభాషను వివరించేవారు. ఒకనాడు ఉపన్యాసం అయిపోయిన తర్వాత వారు వెళ్ళిపోతుంగా వెనకాలే వెళ్ళి నేను ఈ కావ్యభాషపై పరిశోధన

చేస్తానని చెప్పాను. వెంటనే వారు శుభస్య శీఘ్రమ్ అని దీవించారు. 1963లో నేను పరిశోధక విద్యార్థిగా ఆయన దగ్గర చేరాను. అప్పటికే ఆయన వద్ద కల్లూరి నాగభూషణరావు 'నన్నయ భాష'పై పరిశోధన చేస్తున్నారు. 1964లో ప్రసాదరాయ కులపతి 'పోతన భాగవతం'పై పరిశోధన చేయటానికి మహాదేవశాస్త్రి దగ్గర చేరారు. 1965లో మహాదేవశాస్త్రి రీడరుగా పదోన్నతిని పొందారు.

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో పనిచేస్తున్నప్పుడు వీరు ప్రొద్దున 9 గంటలకే శాఖకు వచ్చేవారు. ఒక సంవత్సరం ఎం.ఏ. విద్యార్థులకి వీడుకోలు సభ జరిగింది. అప్పుడు మహాదేవశాస్త్రి ప్రసంగిస్తూ జాస్తి సూర్యనారాయణ ప్రొద్దుటే 9 గంటలకే వచ్చి కృషి చేస్తున్నారన్నారు. అప్పుడు సూర్యనారాయణ నేను ప్రొద్దుటే 9 గంటలకే తెలుగుశాఖకు వస్తున్నాన్న సంగతి శాస్త్రికెలా తెలిసింది ? అంటే ఆయన కూడా 9 గంటలకే వస్తున్నారన్నారు. 9 గంటలకు వస్తే సాయంకాలం 6 గంటల తర్వాతే ఇంటికి వెళ్ళేవారు. పగలంతా కృషి చేసేవారు. నేను పరిశోధన చేసే రోజుల్లో సాయంకాలాలు వారితో కలిసి వాహ్యాళికి కపిలతీర్థం వెళ్ళేవాళ్ళం. దారిలో నాతో భాషాశాస్త్రవిషయాలు ముచ్చటించేవారు. ఎలాగ పరిశోధన చేయాలో ప్రవచించేవారు.

1968లో అనంతపురంలో పి.జి. సెంటరు పెట్టినప్పుడు మహాదేవశాస్త్రి తెలుగు శాఖాధిపతిగా అక్కడకు వెళ్ళారు. 1967లోనే 'ఆంధ్ర సాహిత్య అకాడమీ' వారి కోరిక ననుసరించి నన్నెచోడుని కుమారసంభవ కావ్యాన్ని పరిష్కరించి విపుల పీఠికను రచించారు. అనంతపురం పి.జి. సెంటరుకు ప్రత్యేకాధికారిగా కొన్నాళ్ళు పనిచేశారు. 1976-78 ప్రాంతంలో వీరు జర్మనీ దేశంలోని 'కోలోన్ విశ్వవిద్యాలయం'లో ఆచార్యులుగా పనిచేశారు. అప్పుడే 'గ్రామర్ అండ్ హ్యాండ్ బుక్ ఆఫ్ మోడర్న్ తెలుగు' అనే గ్రంథాన్ని రచించారు. అనంతపురంలో 1981 లో పదవీ విరమణ పొందారు. 1982 లో సింగరాచారి వీధిలోని తమ ఇంట్లోకి వచ్చి చేరారు.

ఈ వ్యాస రచయిత 1967లో పిహెచ్.డి. ముగించి 1968లో 'రాజధాని కళాశాల'లో సహాయాచార్యునిగా చేరాడు. మహాదేవశాస్త్రి తమ నెం.33, సింగరాచారి వీధి ఇంట్లో నన్ను ఉండమని కోరారు. ఆ కోరికను మన్నించి ఆ ఇంట్లో అద్దెకు చేరాను. కోరాడ రామకృష్ణయ్య ఎన్నో గ్రంథాల్ని ఏ మిద్దె మీద రచించారో ఆ మిద్దె మీద నేను చేరాను. అక్కడ మా గురుమాత అన్నపూర్ణమ్మ క్రింద భాగంలో ఉండేవారు. ఆ ఇంటికి కాటూరి, పింగళి, విశ్వనాథ, వేటూరు ప్రభాకరశాస్త్రి, నిడదవోలు వేంకటరావు, దేవులపల్లి మొదలైన పలువురు కవులు, పండితులు, విమర్శకులు వచ్చి ఇష్టాగోష్ఠుల్లో పాల్గొనేవారని చెప్పేవారు. ఈమె పార్థసారథిపై పద్యాలు రచించి మాకు వినిపించేవారు. అలాగే మా గురుపత్ని సరస్వతమ్మ శ్లోకాలు చదివి మా దంపతులకు వినిపించేవారు.

మహాదేవశాస్త్రి పదవీ విరమణ పొందిన తర్వాత ఈ ఇంటికే వచ్చి చేరారు. ఇక్కడే మహాదేవశాస్త్రి ముగ్గురు కొడుకులు, కూతురు విజయలక్ష్మికి పెళ్ళిళ్ళు అయ్యాయి. ఆ శుభకార్యాల్లో మేమూ పాలుపంచుకునేవాళ్ళం. తండ్రి కొడుకులు, అన్నదమ్ములు కూడా కలిసి ఉండని రోజుల్లో గురుశిష్యులు ఎంతగానో కలిసిమెలిసి ఉండటంలో వారి గొప్పదనం సువ్యక్తం. నన్నువారి పెద్దబ్బాయిలాగా భావించి చూచేవారు. నేనూ, నా భార్య కూడా వారితో ఎంతగానో కలిసిమెలిసి ఉండేవాళ్ళం. వారిని ఎంతో గౌరవ భావంతో చూసుకునేవాళ్ళం. మద్రాసు విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో మహాదేవశాస్త్రి అతిథి ఆచార్యులుగా కొన్నాళ్ళు పనిచేశారు. అపుడు వీరు 'ఆంధ్రవాఙ్మయ పరిచయము' అనే గ్రంథాన్ని విద్యార్థుల్ని మనసులో పెట్టుకుని రచించి ప్రచురించారు. బాల ప్రౌఢ వ్యాకరణాల్ని చారిత్రిక భాషా దృక్పథంతో వివరిస్తూ 'వ్యాకరణ దీపిక' అనే గ్రంథాన్ని ప్రచురించారు. 1994 ప్రాంతంలో కోరాడ రామకృష్ణయ్య శతజయంతి సందర్భాన్ని పురస్కరించుకుని రామకృష్ణయ్య కొన్ని వ్యాసాల్ని, దేశంలోని సుప్రసిద్ధ పండితుల, విమర్శకుల వ్యాసాల్ని సంకలనం చేసి ప్రకటించారు. ఆ తర్వాత 'తెలుగు దేశ్యవ్యుత్పత్తి నిఘంటువు'ను కూర్చారు. దీన్ని ద్రావిడ విశ్వవిద్యాలయంవారు ప్రచురించారు. ఇది తెలుగు భాషా పరిశీలకులకు ఎంతో ఉపయోగకరం. 93 ఏళ్ళ వయస్సులో మహాదేవశాస్త్రి 'తెలుగు భాష - సంస్కృతి' అనే గ్రంథాన్ని రచించి ప్రచురించటం

అత్యంతాశ్చర్యజనకం. ఈ గ్రంథాన్ని శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారు ఆవిష్కరించారు.

కోరాడ మహాదేవశాస్త్రి నిరంతరం గ్రంథపఠనం చేస్తుంటారు. తన దగ్గరకు వచ్చినవాళ్ళనందరిని ఇప్పుడు ఏమేమి గ్రంథాలు ప్రకటితమయ్యాయని తెలుసుకుని, వీలయితే ఆ గ్రంథాల్ని తెప్పించుకుని మరీ చదివేవారు. నన్ను నన్నెచోదుని కాలాన్ని ఆ కావ్యభాషను పరికించి, నన్నయతిక్కనాదుల భాషతో పోల్చి నిర్ధారించమన్నారు. నాచేత ఆ వ్యాసాన్ని రచింపచేశారు. అంతేకాదు, ఒకరోజు ప్రొద్దున 8 గంటలకు తన ఆకాశవాణి ప్రసంగం వస్తోంది వినమన్నారు. గురువు చెప్పారు కదా! అని విన్నాను. ఆ ప్రసంగంలో ఈ మధ్యన యల్.బి. శంకరరావు నన్నయ, నన్నెచోడ, తిక్కనాది భాషావిశేషాల్ని పోల్చి నన్నెచోదుని కాలాన్ని తేల్చారన్నారు.

కోరాడ రామకృష్ణయ్య ఇంట్లో ఆయనకంటే, పుత్రరత్నమైన మహాదేవశాస్త్రి కంటే కూడా నేను ఆ ఇంట్లో ఎక్కువ కాలం ఉండటం నా పూర్వజన్మ సుకృతంగా భావిస్తాను. ఒక సభలో తంగిరాల వెంకటసుబ్బారావు కోరాడవారి ఇంట్లో ఉంటూ, శంకరరావువారి భాషా సాహిత్యపాండిత్యాన్ని పుణికి పుచ్చుకున్నారనటం ఆనందదాయకం. అది అతిశయోక్తి అయినా.

మహాదేవశాస్త్రిగారు డిసెంబరు 1921లో జన్మించారు. 1981లో పదవీ విరమణ కావించారు. 2016 అక్టోబరు నెలలో విజయదశమినాడు (11-10-2016) దివంగతులయ్యారు. పుట్టిన ప్రతిప్రాణి గిట్టక తప్పదు కదా! ధ్రువతార రాలిపోయింది.

*****

# గురువాక్కు అమోఘం !

**ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావు**

సెల్ : 09945422742

మా గురువర్యులు ఆచార్య కోరాడ మహాదేవశాస్త్రిగారు గొప్ప పండిత వంశంలో పుట్టారు. వీరి తండ్రిగారు ప్రసిద్ధ భాషాశాస్త్రవేత్త అయిన కోరాడ రామకృష్ణయ్యగారు మద్రాసు విశ్వవిద్యాలయంలో తెలుగు ఆచార్యులుగా, శాఖాధ్యక్షులుగా ఉండినవారు. నన్నెచోడుని కుమారసంభవకావ్యాన్ని పరిష్కరించారు. ''దక్షిణ దేశభాషలు దేశి'', ''ఆంధ్ర భారతకవితావిమర్శనము'', 'సంధి', ''భాషోత్పత్తి'' మొదలైన ఉత్తమ గ్రంథాలను ప్రచురించినారు. మహాదేవశాస్త్రిగారు తండ్రికితగ్గ తనయులు. చారిత్రక భాషాశాస్త్రంలో ఎంతో కృషి చేసినవారు. అనేక గ్రంథాలు ప్రచురించినారు. వీరి మేనమామ (పిల్లనిచ్చిన మామకూడా) ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రిగారు గొప్ప సంస్కృత విద్వాంసులు. కాళిదాసు శాకుంతలాన్ని గురించి మంచి గ్రంథాల్ని ప్రచురించారు. మహాదేవశాస్త్రిగారి ముత్తాతగారైన కోరాడ రామచంద్రశాస్త్రిగారు ''మంజరీ మధుకరీయము'' అనే నాటకాన్ని రచించారు. దీనినే తెలుగులో మొట్టమొదటి నాటకంగా విమర్శకులు అంగీకరించారు.

ఎకనామిక్స్‌లో ఎం.ఏ. డిగ్రీ పుచ్చుకున్న మహాదేవశాస్త్రిగారు, తండ్రిగారి కోరికమీద కలకత్తా విశ్వవిద్యాలయానికి వెళ్ళి, ప్రొ॥ సునీతికుమార్ ఛటర్జీ, ప్రొ॥ సుకుమార్‌సేన్ వంటి మహనీయుల దగ్గర భాషాశాస్త్రంలో ఎం.ఏ., డి.లిట్. డిగ్రీలు తీసుకున్నారు. తరువాత శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో 1959లో తెలుగు ఎం.ఏ. తరగతులు ప్రారంభం కాగా, శాస్త్రిగారు అక్కడ ఉపన్యాసకులుగా చేరారు. నేను వీరి దగ్గర 1961–63 సంవత్సరాలలో తెలుగు ఎం.ఏ. చేశాను. శాస్త్రిగారు మాకు ప్రీవియస్‌లో తెలుగు భాషాచరిత్రను గురించి, ఫైనల్‌లో నన్నెచోడుని కుమారసంభవంలోని భాషను గురించి బోధించారు. ఇంగ్లీషు గడగడా మాట్లాడేవారు. మా పాఠాలన్నీ సగం ఆంగ్లంలోనే బోధించేవారు. "Historical Grammar of Telugu" అనే పరిశోధన గ్రంథాన్ని ప్రచురించారు. తిరుపతిలో లెక్చరర్‌గా, రీడర్‌గా పనిచేసిన శాస్త్రిగారు, తరువాత అనంతపురం పి.జి. సెంటర్‌కు ప్రొఫెసర్‌గా, స్పెషల్ ఆఫీసర్‌గా బదిలీ అయ్యారు. అక్కడే రిటైరయ్యారు. కొన్నాళ్ళు జర్మనీలో తెలుగుభాషను బోధించారు. విదేశీయులకు తెలుగు భాషను బోధించేందుకు ఒక రీడర్‌ను ప్రచురించారు.

మహాదేవశాస్త్రిగారు తూర్పుగోదావరి జిల్లా కోనసీమలోని ''ముంగండ'' అగ్రహారానికి చెందినవారు. (ఈ గ్రామం జగన్నాథ పండితరాయల స్వగ్రామం అని చెబుతారు) తిరుపతిలో ఉన్నప్పుడు శాస్త్రిగారు నిరంతరం (ఆదివారాలు, సెలవు దినాలలో కూడా) తెలుగుశాఖలో తన గదిలో కూర్చొని, చదువుకుంటూ, వ్రాసుకుంటూ ఉండేవారు. విద్యార్థులను ఎంతో ప్రేమగా పలుకరించేవారు. వీరు శిష్యులపై కోపించడం నేనెప్పుడూ చూడలేదు. సర్వవేళలా నవ్వు ముఖంతో ఉండేవారు. అమ్మగారు కూడా నన్ను, మా అవిడనూ ఎంతో ఆప్యాయంగా మాట్లాడించేవారు (అమ్మగారిని చూస్తే నాకు మా పినతల్లి 'గంగాభవాని' గుర్తుకు వచ్చేది). శాస్త్రిగారు మద్రాసు, కలకత్తా, తిరుపతి, అనంతపురం మొదలైన ప్రదేశాలలో నివసించినా సరే, వారి ''గోదావరి కోనసీమ మాండలికం'' (దీర్ఘస్వరాలతో కూడిన భాష) చెక్కుచెదరలేదు.

నేను 1963లో ఎం.ఏ. డిగ్రీ తీసుకున్నాక, పిహెచ్.డి. చేయాలనే సంకల్పంతో శాస్త్రిగారిని సంప్రదించాను. నన్నెచోడుని భాషను గురించి పరిశోధన చేస్తానన్నాను. (శాస్త్రిగారినీ, భద్రిరాజు కృష్ణమూర్తిగారినీ చూచిన తరువాత భాషాశాస్త్రం మీద నాకు ఒక విధమైన క్రేజు ఏర్పడింది. కాని అది నా మనస్తత్వానికి విరుద్ధం. ఈ విషయం శాస్త్రిగారు గమనించారు.) ''నన్నెచోడుని భాష'' అనే సబ్జెక్టు అప్పటికే నా ప్రియమిత్రుడు, నా రూమ్‌మేటు అయిన శ్రీ ఎల్. బి. శంకరరావుకు శాస్త్రిగారు వాగ్దానం చేసి ఉన్నారు. నాకు ఇంకో సబ్జెక్టు ఇవ్వవచ్చు. లేదా ''నన్నెచోడుని భాషలోనే 'క్రియా

పదాలు' ఒకరికి, 'నామవాచకాలు' మరొకరికీ ఇవ్వవచ్చు. కాని నా అభిరుచి భాషావ్యాకరణాలు కావనీ, సాహిత్యమనీ, రెండు సంవత్సరాలు మాకు పాఠాలు చెప్పిన గురువుగారు కనిపెట్టేరు. అందువల్ల "నువ్వు సాహిత్యంలో పరిశోధన చెయ్యి. నీకు మంచి పేరు వస్తుంది!" అని దీవించారు. అలాగే నేను తెలుగు వీరగాథలను గురించి పరిశోధన చేయడం, తరువాత దాన్ని గురించి 'భారతి' మాస పత్రికలో వ్యాసాలు వ్రాయడం చూచి చాలా ఆనందించారు. 2013లో నేను ప్రచురించిన "తెలుగు వీరగాథాకవిత్వము" ఒక కాపీని, నా శిష్యుడైన డా॥ ఆర్. శేషశాస్త్రిద్వారా, అనంతపురంలో ఉన్న గురువుగారికి పంపించాను. 90 ఏళ్ళు దాటిన వయస్సులో కూడా ఆ ఉద్గ్రంథాన్ని క్షుణ్ణంగా చదివి, నన్ను ఎంతో మెచ్చుకుంటూ లేఖ వ్రాశారు. శాస్త్రిగారు చెప్పినట్టుగా జానపద సాహిత్య పరిశోధనలో నాకు మంచి కీర్తి ప్రతిష్టలు లభించాయి. ఏమైనా గురువాక్కు అమోఘం కదా !

శాస్త్రిగారి చెల్లెలు శ్రీమతి భమిడి కమలాదేవిగారు మా స్వగ్రామం తణుకులో ఉంటారు. ఆమె మంచి సంగీత విద్వాంసురాలు. పండితవంశం కాబట్టి సాహిత్యమన్నా ఇష్టమే. ఆమె మా తణుకులో జరిగే సంగీతసాహిత్య కార్యక్రమాలలో చురుకుగా పాల్గొంటూ ఉంటారు. ఈమె భర్త శ్రీ భమిడి విశ్వనాథశర్మ తణుకు హైస్కూల్లో నా సహాధ్యాయి. తణుకులో జయలక్ష్మీ ఫర్టిలైజర్స్‌లో మేనేజర్‌గా ఇప్పటికీ కొనసాగుతున్నారు.

మా గురువులందరిలోనూ పూర్ణాయుష్కులుగా జీవించిన మహనీయులు మహాదేవశాస్త్రిగారు ఒక్కరే ! శాస్త్రిగారు శిష్యవాత్సల్యానికి నిలువెత్తు మణిదర్పణం !

*****

# న గురోరధికమ్

**డా॥ ఇరిగేపల్లి ముద్దప్ప**

సెల్ : 9493049894

యదంఘ్రి కమలద్వంద్వం
ద్వంద్వతాప నివారకమ్
తారకం భవసింధోశ్చ తం
గురుమ్ ప్రణమామ్యహమ్ ॥

'పరమాత్మ వేరు, జీవాత్మవేరు' అని అనుకొనే ద్వంద్వభావాన్ని పోగొట్టి, సాధకుడిని జీవ బ్రహ్మైక్య స్థితికి తీసుకుపోగల సద్గురువుగారి పాదపద్మద్వయానికి అంజలి ఘటిస్తున్నాను.

"ఉత్తమోత్తమ గురుల శిష్యుండనైతి
గురువునయితిని సచ్ఛిష్య కోటులకును"

ఉత్తమోత్తములైన మహనీయ మూర్తులకు శిష్యుడనయ్యాను. వారి ఆశీస్సులతో ఉత్తమ శిష్యకోటికి గురువునయ్యాననే ఆనందం నా హృదయంలో నిరంతరం నిలిచి ఉంటుంది.

ఆచార్య కోరాడ మహాదేవశాస్త్రిగారి విద్వత్తును గూర్చికాని, ఘనతను గూర్చికాని నేనిక్కడ ప్రస్తావించలేదు. నాకు ఆయనతోవున్న అనుబంధాన్ని, గురువుగా వారు నాపై చూపిన ఎనలేని వాత్సల్యాన్ని ఒకటి రెండు సందర్భాలను నేనిక్కడ నెమరు వేసుకొంటున్నాను.

నేను కళాశాల విద్యకొరకు అనంతపురం జిల్లా, మడకశిర తాలూకా అగళి గ్రామం నుండి ఎస్.ఎస్.ఎల్.సి.లో ఉత్తీర్ణుడనై వచ్చాను. రెండేళ్ళ ఇంటర్మీడియట్ (ఎఫ్.ఏ.) కోర్సు, రెండేళ్ళ బి.ఏ. (జువాలజీ) డిగ్రీ కోర్సులను అనంతపురం ప్రభుత్వ ఆర్ట్స్ కళాశాలలో పూర్తి చేశాను. వాస్తవానికి నాది కర్ణాటక రాష్ట్రంలో తుమకూరు జిల్లా, కొరటగెరె తాలూకాలో బొమ్మలదేవిపురం. నా మాతృభాష కన్నడం. ఏదియేమైనా పల్లె నుండి పట్నం వచ్చి, విద్యాభ్యాసం పూర్తిచేసి, 'తమసోమా జ్యోతిర్గమయ' చీకటి నుండి వెలుగులోకి అనగా అజ్ఞానదశ నుండి జ్ఞానదశకు చేరుకున్నాను.

ఆ తర్వాత ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమీషన్‌వారు ప్రతిభా ప్రాతిపదికపై లోయర్ డివిజన్ గుమాస్తాగా ఎంపిక చేసినందున అనంతపురంలో విద్యుత్‌శాఖ యందు ఉద్యోగినయ్యాను. 1967-68వ విద్యాసంవత్సరంలో 'తెలుగు భాషా సాహిత్యాలు' తీసుకొని తిరుపతి ఎస్వీ యూనివర్శిటీలో ఎం.ఏ. ప్రీవియస్ పూర్తి చేశాను. ఆ తరువాత ఎస్వీ యూనివర్శిటీ పి.జి. కేంద్రాన్ని అనంతపురం ప్రభుత్వ ఆర్ట్స్ కళాశాల 'న్యూబ్లాక్' లోనికి మార్చారు. అక్కడ నేను 1968-69 విద్యా సంవత్సరంలో ఎం.ఏ. ఫైనల్ పూర్తి చేశాను.

ఒకరోజు ఫైనల్ ఎం.ఏ. తెలుగు లింగ్విస్టిక్స్ క్లాసు తీసుకొని, ప్రొఫెసర్‌గారు వెళ్ళిపోయారు. తర్వాత అక్కడ మాకు క్లాసులేదు. టేబుల్‌మీద వారి పెన్ను మర్చిపోయారు. దాన్ని వారికిస్తామని నేను వెళ్ళాను. "ఏం ముద్దప్పా!", "ఏమీ లేదుసార్, మీరు క్లాస్‌లో పెన్ను మర్చిపోయివచ్చారు. దాన్ని మీకిస్తామని వచ్చా"నన్నాను. నేను ఈ విషయాన్ని చెప్పి, పెన్ను ఇవ్వబోతే ఆయన సంతోషంగా తీసుకొని, ధన్యవాదాలు చెబుతారని అనుకొన్నా, కానీ వారు వెంటనే "అవును, నీవెందుకు తెచ్చావు" అన్నారు. "మీ క్లాసు తర్వాత క్లాసు లేదు సార్" అన్నాను. "అయితే ఏమి ?" "ఎవరైనా పట్టుకెళ్తారని" నీవు పట్టుకొచ్చావా ? నీవు తేలేక పోయివుంటే ఏమయ్యేది? అది అక్కడే వుంటుంది కదా ! నీలాగే అందరు నాది కాదు అని వదిలేసి వుంటే అది అక్కడే వుండేది కదా ! నీది కానిదాన్ని నీవు తీసుకోవద్దు. అందరూ అలా అనుకొని, దాన్ని వదిలేస్తే నా వస్తువు నాకే దక్కేది కదా ! ఎనీ హౌ థ్యాంక్స్" అని తీసుకొన్నారు. ముఖం చిన్నబుచ్చుకొని వచ్చాను. అది వారి వ్యక్తిత్వ లక్షణాల్లో మచ్చుతునక. పరులసొమ్ముపై ఆశ చూపవద్దు అనేది.

ఎం.ఏ. తెలుగు పూర్తిచేసిన తర్వాత విద్యుత్ శాఖ నుండి విద్యాశాఖలోకి బదిలీ అయ్యాను. అధ్యాపకుడుగా అవిరళకృషి చేస్తూ పిహెచ్.డి. పట్టా సంపాదించాను. ఈ

విధంగా నేను, నా జీవన విధానాన్ని గడుపుతున్నానంటే అది ఆ మహానుభావుడైన మహాదేవశాస్త్రిగారి వాత్సల్య పూరిత శుభాశీస్సులే కారణమని భావిస్తాను.

కొంతకాలం ఉద్యోగం చేసి భార్యా పిల్లలతో కాపురం చేస్తూ ఎం.ఏ. చదవడానికి తిరుపతికి రావటంవలన ఎం.ఏ., ప్రీవియస్ క్లాస్‌లో నా సహపాఠకులకంటే నేను వయస్సులో పెద్దవాడిగా ఉండేవాడిని కనుక నాకు వారితో కలిసి చదవటం బిడియంగా తోచేది. అందువల్ల హాస్టల్ వసతి వుండినా, ప్రత్యేకంగా టౌన్‌లో అద్దెగదిలో ఉంటూ కాలేజీకి వెళ్ళేవాడిని. ఆ విధంగా చదువుకొంటున్న రోజుల్లో ఒకరోజు తెలుగు ప్రొఫెసర్ జి.ఎన్.రెడ్డిగారు, రీడర్ డా॥ కోరాడ మహాదేవశాస్త్రిగారు కలిసి నా గదికి వచ్చి, నా పరిస్థితులు గమనించి నన్ను పరామర్శించారు. "ఒకవేళ క్లాసులో సహపాఠకులతో కలిసి చదవటానికి బిడియమైతే, మేమే నీ రూముకు వచ్చి విద్యావిషయాలను చెబుతా"మన్నారు. ఆ మాటలు విన్న నాకు, వారికి నాపట్లగల ప్రేమ అర్థమయింది.

ఆనాటి నుండి నేను కోరాడ మహాదేవశాస్త్రిగారికి అనుంగు శిష్యుడనయ్యాను. ఆడుతూ పాడుతూ చిన్నవాళ్ళ మధ్య, గురువుల ప్రోత్సాహంతో, హార్సిలీహిల్స్‌లాంటి ప్రదేశాలకు విహారయాత్ర చేస్తూ ఆనందంగా తెలుగు ఎం.ఏ. ప్రీవియస్ పూర్తి చేశాను.

సాధ్యమైనంతవరకు ఆచార్యులవారి రచనలన్నింటిని చదివే అవకాశం నాకు లభించింది. అంటే తిక్కన సోమయాజికి కుమ్మర గురునాథునివలె వ్యవహరించానేమో అనే ఆత్మసంతృప్తి నాకు కలిగింది. గురువుగారి పేరు మీద వచ్చిన 'తెలుగు వాఙ్మయ పరిచయం' (తెలుగు సాహిత్య సంగ్రహ పరిచయం) ప్రసిద్ధ తెలుగు పద్యాల సంకలన సంపుటం 'ప్రెస్ కాపీ' తయారు చేయడం మొదలుకొని, స్వర్గీయ వేదం వేంకటరాయశాస్త్రిగారి ప్రెస్‌లో ప్రచురణ చేయించే భాగ్యం నాకు కలిగింది.

ఆచార్యులవారు పదవీ విరమణ చేసిన తరువాత, ఆయనతో కలిసి కృషిచేసిన నిఘంటువు "తెలుగు దేశ్యవ్యుత్పత్తి పదకోశం". దీన్ని కుప్పం ద్రావిడ విశ్వవిద్యాలయంవారు ప్రచురించారు. ఇందులో భాగంగా నాకు 'కుప్పం'కు వెళ్ళివచ్చే అదృష్టం కలిగింది. అంతకు మించి నిఘంటువు తయారు చేయడంలో సహాయ సంపాదకుడిగా స్థానం కల్పించడం ముదావహం. ఇంతేగాకుండ "జన్యుపదాలు" అనే వ్యాసం మా ఇరువురి సంయుక్త రచన. ఇవి మాత్రమేగాక నేను సొంతంగా రచించిన 4 వ్యాసాలు నాలుగు భిన్న విజ్ఞానసర్వస్వాల్లో ప్రచురితమయ్యాయని తెలుపుటకు గర్విస్తున్నాను. దీనికి గురుకృపాకటాక్షమే కారణం.

గురువుగారితో కలిసి కొన్ని ద్రవిడియన్ లింగ్విస్టిక్స్ అసోసియేషన్ (ద్రావిడభాషా సంఘం) కాన్ఫరెన్స్‌లకు హాజరుకావడం నాలో మరింత ఉత్సాహాన్ని కలిగించింది. కాన్ఫరెన్స్‌కు పేపర్లు సమర్పించడం కూడా జరిగింది. ముఖ్యంగా తిరుపతి కాన్ఫరెన్స్ మరువలేనిది. రైలు ప్రయాణంలో నా బట్టల సూట్‌కేస్ అపహరించబడింది. నేను చాలా భయపడ్డాను, బాధపడ్డాను. కట్టుకోవడానికి మరో వస్త్రం లేని పరిస్థితి. నా దుస్థితి చూచిన ఆచార్యులవారు పుత్రవాత్సల్యంతో వారి పంచె తీసిచ్చి దీన్ని ధరించి, పైన రెడీమేడ్ షర్ట్ వేసుకొని కాన్ఫరెన్స్‌కు వెళ్దాం రమ్మన్నారు. కాన్ఫరెన్స్ ముగిసిన తర్వాత పేపర్ విషయాలు ముచ్చటిస్తూ వారితో కలిసి వచ్చాను. ఇది గురువుగారి ఆత్మీయతకు నిదర్శనం.

అన్నపూర్ణే సదా పూర్ణే శంకర ప్రాణవల్లభే ।<br>జ్ఞాన వైరాగ్య సిద్ధ్యర్థం భిక్షాందేహి చ పార్వతీ ॥

ఒక రోజు నేనూ, గురువుగారు ఇద్దరం వారింట్లో భోజనానికి కూర్చున్నాం. అన్నపూర్ణాదేవి స్వరూపులైన గురుపత్ని శ్రీమతి సరస్వతమ్మగారు నాకు, ఆచార్యులవారికి భోజనం వడ్డిస్తున్నారు. అన్ని వంటకాలు ఇద్దరికీ వడ్డించారు. "ఊఁ భోజనం కానీ" అన్నారు. "మీ ఇస్తర్లోకి ఒక పదార్థం ఇంకా వడ్డించలేదు సార్" అన్నాను. "అది నాకు వడ్డించదు లే ! నీవు తిను" అన్నారు. "అదేం సార్! అలా అంటారు?" అన్నాను. "అదంతే" అన్నారు వారు. ఆ సమయంలో వారితోపాటు తినటానికి జంకు భయం రెండు ఏకకాలంలో కలిగాయి. వారేమో! "తినమ్మా నీవు తిను. ఆ పదార్థం నాకు పడదులే

అందుకే వద్దన జరుగలేదు. నీవు కానీ" అన్నారు. ప్రతి పురుషుని అభ్యున్నతి వెనుక ఒక స్త్రీమూర్తి అమృత హస్తం ఉంటుందనడానికి మహాదేవశాస్త్రి దంపతుల ఆదర్శ జీవనమే ఉదాహరణ.

ఒకసారి ట్రిప్లికేన్‌లో ఉండే శ్రీ పార్థసారధి స్వామివారి ఆలయం ఉత్తరమాడలో వెళ్తున్నాం. నేనెందుకో సార్ చేతిలోని సంచిని తీసుకొని, నా భుజాన వేసుకొన్నాను. కొంత దూరం నడిచాక "ముద్దప్పా! ఆగు అన్నారు. "ఏం సార్" అంటూ నిలబడ్డాను. వెంటనే నా భుజనవున్న సంచిని తీసుకొని ఆయన పట్టుకొని "ఇక పదా!" అన్నారు. నేను నానావిధాలుగా సంచి తిరిగి తీసుకోవడానికి ప్రయత్నించాను. అపుడు వారు వాత్సల్యంతో అన్నమాటలు ఇప్పటికీ నా చెవుల్లో మార్మోగుతున్నాయి. "ముద్దప్పా! నీవున్న స్టైల్‌కి భుజంపై సంచిని వ్రేలాడిస్తూ వెళ్తుంటే, ఎవరో ప్రచారకుడి లాగా కనిపిస్తున్నావు అందుకని తీసుకున్నాను" అంటూ ఇక పద! నీవు మాట్లాడొద్దు'' అన్నారు. దీని భావం పాఠకులు గ్రహించగలరు. నేను మాత్రం ఆయన ఆత్మీయతను మరువలేను.

ఈ విధంగా నెమరువేసుకుంటూ పోతుంటే జీవితమంతా ఆయనతో గడిపిన మధురస్మృతులు నా మదిలో మెదలుతూ ఉంటాయి. ప్రస్తుతమున్న నా శేషజీవితానికి ఆ మధురానుభూతులే ఆనందం. ఇది నా మానసిక చైతన్యం.

ఆచార్య కోరాడ మహాదేవశాస్త్రిగారు మహనీయ ద్రావిడయోగులు. వారు భౌతిక దేహానంతరం కూడా అదృశ్యరూపంలో తమ్మునమ్మి కొలిచే శిష్యులపాలిట కొంగు బంగారమై, వారి సమాధి నుండే వారిని రక్షిస్తారు. ఆ మహనీయ గురుమూర్తుల ఋణం, వారి శిష్యులు ఎట్లు తీర్చుకోగలరు ? సద్గురువు గారి ప్రేమసాగరంలో ఆనందంతో మునకలు వేసిన శిష్యులు అందులో కొంతకు కొంత ప్రేమనయినా తోటిమానవులపై చూపితే చాలు. ఆచార్య మహాదేవశాస్త్రిగారి వంటి సద్గురువుల ఆశయాలకు అనుగుణంగా నడచుకొంటూ వారి సాన్నిధ్యంలో శిష్యుడుగా పొందిన ఆనందానుభూతులను, తాను అభ్యసించిన తరణోపాయ మార్గాలను భావితరాల శిష్యులకు అందించాలి. అదియే సద్గురుపాద పద్మాలకు 'శిష్యులందజేయగల నిజమైన నివాళి'

'గురుభ్యోనమః'

*****

# ఉత్తమోత్తమ సద్గురు పారిజాతం కోరాడ మహాదేవుడు

**డా॥ జి. ఆంజనేయులు**

సెల్ : **8919820975**

సదాశివ సమారంభామ్
శంకరాచార్య మధ్యమామ్
అస్మదాచార్య పర్యంతామ్
వందేగురు పరంపరామ్

సదాశివుడు మొదలుకొని జగద్గురు శంకరాచార్యుల తరువాత అస్మదాచార్యులు ఆచార్య కోరాడ మహాదేవశాస్త్రిగారి వరకుగల గురుపరంపరకు వందనాలు.

"ఉత్తమోత్తమ గురుల శిష్యుండనైతి
గురువునయితిని సచ్ఛిష్య కోటులకును"

అనుట నా విషయంలో సార్థకమైనది. నేను 1967 సెప్టెంబర్ నెలలో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో యం.ఏ. (తెలుగు భాషా సాహిత్యాలు) ప్రీవియస్‌లో చేరాను. అనంతపురం పి.జి. సెంటర్ 1968–69 విద్యా సంవత్సరంలో ప్రారంభించడంవల్ల ప్రీవియస్ తిరుపతిలో పూర్తిచేసి, ఫైనల్ ఇయర్‌కి అనంతపురం వచ్చాను.

మొట్టమొదట తెలుగు శాఖకు వెళ్ళాను. ప్రప్రథమంగా డా॥ కోరాడ మహాదేవశాస్త్రిగారు దర్శనమిచ్చారు. నమస్కరించాను. గురువుగారు మంచి మనస్సుతో ఆశీర్వదించారు. తరగతులు ప్రారంభయ్యాయి.

శ్రీ తిరుపతి వేంకట కవులు రచించిన ముద్రారాక్షసమనే నాటకాన్ని, నాటక లక్షణాలతో సుమధుర సుందరంగా మహాదేవశాస్త్రిగారు బోధించారు.

"తలపయినున్న దేమి యవి ? ధన్యశశాకరరేఖ" అనే పద్యాన్ని విద్యార్థులనాకట్టుకొనేలా నిరుపమానంగా బోధించారు.

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ కళాశాల ఎం.ఏ. ప్రీవియస్ తెలుగుశాఖలో 20 మంది విద్యార్థినీ విద్యార్థులు చేరారు. 1967–68 విద్యా సంవత్సరం ఆనందదాయకంగా ముగిసింది.

1968–69 విద్యా సం॥లో మేము పదిమంది అనంతపురం ప్రభుత్వ ఆర్ట్స్ కళాశాల న్యూ బ్లాక్‌లో అడుగిడినాము.

ఆచార్య మహాదేవశాస్త్రిగారు తెలుగు రీడర్‌గా అనంతపురం పి.జి. కేంద్ర ఆంధ్రభారతిలో శ్రీపాదము మోపారు. జనరల్ లింగ్విస్టిక్స్ (భాషాశాస్త్రాన్ని) సమర్థంగా బోధించారు.

డా॥ మహాదేవశాస్త్రిగారితోబాటు డా॥ కల్లూరు నాగభూషణరావుగారు ఎఱ్ఱన నృసింహ పురాణము, అరణ్య పరశేషములు, డా॥ రామచంద్రచౌదరిగారు లిటరరీ క్రిటిసిజమ్, డా॥ శలాక రఘునాథశర్మగారు కాళిదాసు రచించిన 'రఘువంశం' ఐదవ సర్గ, మహాకవి దండి రచించిన దశకుమారచరితములు బోధించారు.

విశిష్ట పురస్కారం : డా॥ కోరాడ మహాదేవశాస్త్రిగారిని వారి శిష్యుడు శ్రీ ప్రసాదరాయకులపతి 2005 సం॥ కనకాభిషేకం చేసి ఘనంగా సత్కరించారు. అతడు గురువుగారి ఆశీస్సులతో కుర్తాళం పీఠాధిపతియై శ్రీశ్రీశ్రీ సిద్ధేశ్వరానందభారతి అనే దీక్షానామంతో వెలుగొందుతున్నారు.

డా॥ మహాదేవశాస్త్రిగారికి సద్గురు శివానందమూర్తిగారు గంగాదేవి ఎమినెంట్ సిటిజన్ పురస్కారాన్ని 2008 సం॥లో ప్రదానం చేశారు.

ఆచార్య కోరాడ వారిది విద్వద్వంశం, తండ్రి, తాత ముత్తాతలు మహా విద్వాంసులు. ధర్మపత్ని శ్రీమతి సరస్వతి, శ్రీవారికి తలలోని నాలుక, అనుకూలవతి. అన్ని విధాల ఆమె జ్ఞానసరస్వతి.

సంతానం : వీరికి ముగ్గురు కుమారులు, ఒక్క కుమార్తె ఉన్నారు. పెద్దకుమారుడు డా॥ కోరాడ రామక్రిష్ణ శ్రీ సాయిబాబా నేషనల్ జూనియర్ కళాశాలలో ఇంగ్లీషు లెక్చరర్‌గా, ప్రిన్సిపాల్‌గా విధి నిర్వహణచేసి పదవీ విరమణ చేశారు. రెండవ పుత్రుడు కోరాడ వెంకటరమణ అమెరికాలో సైంటిస్ట్‌గా పనిచేశారు. మూడవ పుత్రుడు కోరాడ సూర్యనారాయణ తిరుపతి రాష్ట్రీయ సంస్కృత విశ్వవిద్యాలయంలో ఆచార్యులుగా పనిచేస్తున్నారు. ఒక్కగానొక్క కుమార్తె శ్రీమతి కోరాడ విజయలక్ష్మి ఉత్తమ గృహిణిగా రాణిస్తున్నది.

డా॥ శాస్త్రిగారు నిత్య కల్యాణమూర్తులు. ద్రావిడ భాషా సాహిత్యయోగులు, నిత్యానందభాసితులు. ఏడు దశాబ్దాల పరిశోధన చేసిన కోరాడ మహాదేవశాస్త్రిగారిని శ్రీఖరనామ సం॥ బ్రౌన్ పురస్కారానికి ఎంపిక చేశామని తమ్మినేని యదుకులభూషన్‌గారు (న్యూజెర్సీ, అమెరికా) ప్రకటించారు. ఇందుకు వీరి సచ్ఛిష్యులు, సహ అధ్యాపకులు, అభిమానులు అందరూ మహానంద భరితులయ్యారు. ఈ పురస్కారాన్ని ఆచార్య మహాదేవశాస్త్రిగారికి చెన్నైలో 10-12-2011న ప్రదానం చేశారు.

ఆచార్య మహాదేవశాస్త్రిగారు తెలుగు పరిశోధనా రంగంలో భీష్మపితామహులు, వీరి తెలుగు 'చారిత్రక వ్యాకరణం' ప్రసిద్ధమైనది. ఈ విశిష్టగ్రంథాన్ని హరప్పా లిపిలో చదివే ప్రయత్నంలో ఐరావతం మహాదేవన్‌గారు వినియోగించుకున్నారు. శాస్త్రిగారు దక్షిణ భారతదేశంలోనేకాక, జర్మనీలోకూడా ఆచార్యత్వం వహించి, పెక్కుమేటి గ్రంథాలను రచించి, పండితాగ్రేసరుల అభినందనలందుకొన్నారు. వీరి సద్గ్రంథాలు పునర్ముద్రణకు నోచుకోనున్నవి.

''బ్రతికినందాక విద్యనుబడయువలయు'', "విద్యగలవానికెందును వింత లేదు", "వరలు ప్రియవాదికిని శాత్రవంబులేదు'' అని త్రికరణశుద్ధిగా విశ్వసించిన అస్మదాచార్యులు కోరాడ మహాదేవశాస్త్రిగారు కారణజన్ములు, అజరామరులు.

ఈ వ్యాసం భక్తిప్రపత్తులతో డా॥ కోరాడ మహాదేవశాస్త్రిగారికి అంకితం.

*****

# బ్రాహ్మీమయమూర్తి ఆచార్య కోరాడ మహాదేవశాస్త్రి

డా॥ పి. రమేష్‌నారాయణ

సెల్ : 9441383888

భారతీయ భాషాసాహిత్యాల్లో అత్యంత నిష్ణాతుడు 20వ శతాబ్దంలో ద్రావిడ భాషాశాస్త్ర విజ్ఞానంలో విశేష ప్రభావశీలకమైన పండితశిరోమణి ఆచార్య కోరాడ మహాదేవశాస్త్రి. శ్రీశైల భ్రమరాంబికాదేవి అనుగ్రహపాత్రుడు, కోరాడవంశ మూల పురుషుడు అయిన మహాదేవశాస్త్రిగారి పేరు ఈయనకు ఈతరంలో వ్యవహార నామమయింది. ఆచార్య మహాదేవశాస్త్రిగారి ముత్తాత గారైన రామచంద్రకవిగారు తెలుగుభాషను తన తరంలో సుసంపన్నం గావించిన మహాపండితుడు. ఈయన రచించిన 'మంజరీ మధుకరీయం' తెలుగు సాహిత్యంలో తొలినాటకంగా ప్రశంసలనందుకొన్న రచన. ఈయన సుప్రసిద్ధ సంస్కృతగ్రంథం 'ఘనవృత్తం' కాళిదాసు 'మేఘ సందేశానికి' ప్రతిసందేశ కావ్యం. ఆచార్య మహదేవశాస్త్రిగారి తండ్రి కోరాడ రామక్రిష్ణయ్యగారు పంతొమ్మిదవ శతాబ్ద కాలంలో మద్రాసు విశ్వవిద్యాలయం తెలుగు శాఖకు ఆచార్యులుగా వుంటూ ఆంధ్రభాషా వాఙ్మయరంగంలో విశేష పరిశోధనలు గావించి తెలుగుభాషకు నూతన మార్గాన్ని నిర్దేశించిన మహాపండితుడు, తెలుగు సాహిత్యంలోనూ, ద్రావిడ భాషాసాహిత్యాలలోనూ తులనాత్మక పరిశోధనకు మార్గదర్శకులైన ప్రతిభామూర్తి శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు. ఈ నేపథ్యంలో జన్మించిన ఆచార్య మహదేవశాస్త్రిగారు వర్తమాన తెలుగు సాహిత్యంలో సుప్రసిద్ధ భాషాశాస్త్రవేత్తగా తెలుగు భాషకు మొట్టమొదటి చారిత్రక వ్యాసం అందించిన పండిత శిరోమణి.

ఆచార్య కోరాడ మహదేవశాస్త్రిగారు శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారి ద్వితీయ పుత్రులుగా 19-12-1921లో మచిలీపట్నంలో జన్మించారు. విద్యాభ్యాసకాలంలో ప్రారంభం నుండి ఉత్తమశ్రేణి విద్యార్థిగా రాణించిన శాస్త్రిగారు మెట్రిక్యులేషన్, బి.ఏ. ఆనర్స్ మొదటి తరగతిలో ఉత్తీర్ణత సాధించి 1942వ సం॥లో మద్రాసులోని ప్రెసిడెన్సీ కళాశాలలో ఆర్థిక శాస్త్రం, చరిత్ర ప్రధాన అంశాలుగా స్వీకరించి ఎం.ఏ. డిగ్రీని ప్రథమ శ్రేణిలో సాధించారు. 1942-44 సం॥లో ప్రముఖ చారిత్రక పరిశోధకులు, ఆచార్యులు అయిన నేలటూరి వేంకటరమణయ్యగారి ఆధ్వర్యములో "కాకతీయుల చరిత్ర, సంస్కృతి" అనే అంశంమీద పరిశోధన గావించారు. ఆ కాలంలోనే భారతప్రభుత్వం లేబర్ ఇన్వెస్టిగేషన్ కమిటీ రిసెర్చ్ ఆఫీసరుగా ఉద్యోగం రావడంతో సిమ్లాలో 1944-46 సం॥లో కేంద్రప్రభుత్వం కార్మికశాఖలో ఉద్యోగ బాధ్యతలు నిర్వహించారు. తర్వాతిగా ఢిల్లీలో ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ ఛేంబర్ ఆఫ్ కామర్స్ అండ్ ఇండస్ట్రీ (ఫిక్కి)లో సీనియర్ రిసెర్చి ఆఫీసర్‌గా పనిచేశారు.

శ్రీ శాస్త్రిగారు వృత్తిరీత్యా ఆర్థికశాస్త్రం, చరిత్ర, కార్మికరంగం వంటి అంశాల్లో పరిశోధకుడుగా వుంటున్నా భాషాశాస్త్రంపై విశేష ఆసక్తి కలిగి వుండటంచే తన తండ్రిగారైన శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారితోబాటు వీలయినపుడల్లా ఆల్ ఇండియా ఓరియంటల్ కాన్ఫరెన్సులలో పాల్గొనేవారు. దర్భంగాలో 1948వ సం॥లో జరిగిన ఒక సమావేశంలో ఆనాటి ప్రసిద్ధ భాషాశాస్త్రవేత్త ఆచార్య సునీతికుమార్ ఛటర్జీగారి ఉపన్యాసం వివడం తటస్థించింది. "భారతీయ భాషల్లో తెలుగు భాషా పరిశోధనకు పూనుకునేవారు చాలా తక్కువగా వున్నారు. తెలుగు భాషా పరిణామం వివరించే చారిత్రక వ్యాకరణ రచనకు యువకులు పూనుకోవాలి" అనే సందేశానికి శ్రీ శాస్త్రిగారెంతో ప్రభావితులయ్యారు. ప్రసిద్ధ పండితులైన తన తండ్రి సైతం ఇలాంటి భావజాలాన్ని కలిగి వుండటంచే ఆయన ఆశీర్వాదం పొంది శ్రీ శాస్త్రిగారు తన "ఫిక్కీ" ఉద్యోగానికి రాజీనామానిచ్చి కలకత్తాకు వెళ్ళి, ఆచార్య ఛటర్జీగారిని కలిశారు. ఆయన సూచనతో 'ద్రవిడియన్ ఫైలాలజి'ని పరిశోధక అంశంగా స్వీకరించారు. దానితోపాటు టిబెటన్ భాషా అధ్యయనం సైతం గావించడానికి ఒక బౌద్ధ సన్యాసి సైతం ఆయనకు తోడుగా వుండేవారు. ఆ కాలంలోనే ప్రసిద్ధ సాహితీవేత్త, ఆచార్య క్షితిస్‌చంద్ర ఛటర్జీగారికి ఎంతో

ప్రీతిపాత్రులు కాగలిగారు. శ్రీ శాస్త్రిగారు ఈ విధంగా రెండేళ్ళు అక్కడ చదివి ప్రథమ శ్రేణిలో పాసై, కలకత్తా విశ్వవిద్యాలయం నుండి బంగారు పతకం పొందారు. ఆచార్య సునీతికుమార్ ఛటర్జీగారి పర్యవేక్షణలో 'హిస్టారికల్ గ్రామర్ ఆఫ్ తెలుగు' అంశంపై ఒక సిద్ధాంత గ్రంథాన్ని 1959వ సం॥ నాటి కలకత్తా విశ్వవిద్యాలయానికి సమర్పించారు. ఈ సిద్ధాంత గ్రంథాన్ని పరిశీలకులుగా గమనించిన ముగ్గురు విదేశీ భాషా శాస్త్రవేత్తలు కాలిఫోర్నియాకు చెందిన ఎం.బి. ఎమోనో, ఆక్స్‌ఫర్డుకు చెందిన టి.బర్రో, లండన్‌కు చెందిన ఆల్‌ఫ్రెడ్ మాస్టర్ ఈ గ్రంథాన్ని విశేషంగా ప్రశంసించారు. కలకత్తాలో శ్రీ శాస్త్రిగారు పరిశోధక విద్యార్థిగా వున్నప్పుడు ఆంత్రపాలజీ శాఖవారి ఒక ప్రాజెక్టుకు ఫీల్డ్‌వర్క్ గావించడానికి బాధ్యతలు స్వీకరించి ఆనాటి వారణాసి పరిసర గ్రామాల మాండలికాన్ని అధ్యయనం చేసి 'పశ్చిమ భోజపురి భాషా వ్యాకరణం' అన్న గ్రంథం ఆ శాఖవారికి సమర్పించారు. ఆ కాలంలో ఆయన సహచరులుగా ఫీల్డ్ వర్క్ గావించిన అమెరికాకు చెందిన కొలంబియా విశ్వవిద్యాలయం పరిశోధక బృందం ఈ గ్రంథాన్ని తీసుకువెళ్ళి ముద్రించారు. 1957వ సం॥లో ప్రతిష్టాత్మక 'రాక్ ఫెల్లర్ ఫౌండేషన్' స్కాలర్‌షిప్‌కు ఈయన ఎన్నుకోబడినప్పటికి తండ్రిగారి అనారోగ్యకారణంగా వెళ్ళలేకపోయారు.

1957లో చిదంబరంలోని అన్నామలై విశ్వవిద్యాలయంలో ఆచార్య మీనాక్షి సుందరంపిళ్లై ఆధ్వర్యంలోని లింగ్విస్టిక్స్ శాఖలో అధ్యాపకుడుగా ఆయన ఉద్యోగం గావించారు. 1960లో తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగు విభాగానికి వచ్చి అధ్యాపకులుగా కొనసాగారు. ఆకాలంలో భాషాపండితులకు భాషాశాస్త్ర పరిచయం గావించాలంటూ విశ్వవిద్యాలయాలు నిర్వహించే సదస్సులు అన్నింటికి దేశంలోని పలు ప్రాంతాల్లో జరుపబడే సెమినార్లకు శ్రీ శాస్త్రిగారు ఒక ప్రముఖ రిసోర్స్‌పర్సన్ ఆచార్యులుగా బాధ్యతలు అందించారు. 1964వ సం॥ నాటికి వీటన్నింటి ఫలితంగా ప్రారంభమైన 'ద్రవిడియన్ లింగ్విస్టిక్స్ అసోసియేషన్' తర్వాతి సంవత్సరాల్లో దీనికి అనుబంధంగా 'ఇంటర్నేషనల్ స్కూల్ ఆఫ్ ద్రవిడియన్ లింగ్విస్టిక్స్' సైతం రూపొంది ద్రావిడభాషల అధ్యయనానికి పరిశోధనకు, కేంద్రబిందువులుగా ఇవి రూపొందాయి.

ద్రావిడభాషా కుటుంబంలో భాషాశాస్త్రానికి, చారిత్రక వ్యాకరణానికి, తులనాత్మక అధ్యయనానికి తండ్రిని మించిన తనయులుగా వర్తమాన కాలంలో శ్రీ కోరాడ మహాదేవశాస్త్రిగారు గావించిన కృషి అనిర్వచనీయమైన అంశంగా ప్రకటిస్తే అతిశయోక్తి ఏమీలేదు. 1976–78 సం॥ కాలంలో జర్మనీలోని కొలోన్ యూనివర్శిటి విజిటింగ్ ప్రొఫెసర్‌గా వెళ్లి, అక్కడ "వర్ణనాత్మక ఆధునికాంధ్ర భాషా వ్యాకరణం" అనే ప్రసిద్ధ గ్రంథం రచించారు.

శ్రీ శాస్త్రిగారి జీవితంలోని మైలురాళ్ళు వంటి సన్నివేశాల్లో ఒకటి 1968వ సం॥లో తిరుపతి శ్రీ వేంకటేశ్వర విద్యాలయం వారి పోస్ట్‌గ్రాడ్యుయేట్ సెంటర్ అనంతపురంలో స్థాపించిన కాలం ప్రముఖంగా పేర్కొనాల్సి ఉంటుంది. కరువు ప్రాంతంగా ప్రసిద్ధి చెందిన ప్రాంతం అనంతపురం. "క్షామములెన్ని వచ్చిన రసజ్ఞత ఇంచుక చావలేదు భావామృతవృష్టికి కొదువలేదు" అంటూ ప్రసిద్ధ సాహితీమూర్తి నండూరి రామకృష్ణమాచార్యులుగారి అభిప్రాయం సాకారం గావించడానికా అన్నరీతిగా శ్రీ కోరాడ మహాదేవశాస్త్రిగారు ఇక్కడి పి.జి. సెంటరుకు తెలుగు విభాగం ఆచార్యులుగా పదవీ బాధ్యతలు చేపట్టడం అనవచ్చు. దీని కారణంగా 1968–1981 సం॥ల సుదీర్ఘ కాలంబాటు ఈనాటి అనంతపురం శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో ఆంధ్రశాఖకు, తులనాత్మక అధ్యయన శాఖకు మొట్టమొదటి వ్యక్తిగా బహుముఖ సేవలను శ్రీ శాస్త్రిగారు అందించారు. తెలుగు ఆచార్యులుగా ప్రత్యేక అధికారిగా, విశ్వవిద్యాలయ కళాశాల అధ్యక్షులుగా, భాషా శాస్త్రప్రవీణులుగా తాను 1981వ సం॥లో పదవీ విరమణ గావించేదాక విశేష సేవలను ఆయన అందించారు. తెలుగు భాష అధ్యయనం, బోధన, భాషాశాస్త్ర పరిశోధన, అంశాలుగా తన జీవిత కాలంలో మూడు దశాబ్దాలు పైగా చిరస్మరణీయ సేవలు గావించినవారు శ్రీ కోరాడ మహాదేవశాస్త్రిగారు. అంతపురంలో రెండు దశాబ్దాలపైగా ఈ రంగంలో నిర్విరామంగా తెలుగు సాహిత్యానికి

సేవలనందిస్తూ అనేకములైన స్థానిక, ప్రాంతీయ, జాతీయ, అంతర్జాతీయ సాహిత్య సదస్సులు, సభలు, సమావేశాల్లో పాల్గొనడమూ, స్వయంగా నిర్వహించడమూ గావించారు. ఎన్నో విలువైన భాషాశాస్త్ర పరిశోధకవ్యాసాలు సమర్పించారు. సుమారు పదిహేను గ్రంథాలు తాను సైతం స్వయంగా రచించారు. ప్రస్తుత కాలంలో దక్షిణ భారతదేశంలో ప్రసిద్ధ సాహితీవేత్తలుగా, విశ్వవిద్యాలయ ఆచార్యులుగా, కళాశాలల తెలుగు ఆచార్యులుగా పదవులు నిర్వహించిన ఎందరో ప్రముఖులు శ్రీ శాస్త్రిగారి విద్యార్థులుగా వున్నారు. అంతేకాదు, తాను సైతం ఒక నిత్య విద్యార్థిగా జీవితాంతమూ తెలుగు భాషకు గావించిన నిరంతర సేవకు ప్రతిఫలంగా దేశంలోని ఎన్నో ప్రసిద్ధ సంస్థలు అయన్ను సముచితంగా సన్మానించి తమ్ముతాము గౌరవించుకొన్నాయి. ఏది ఏమయినప్పటికి భారతీయభాషా సాహిత్యాల్లో దాక్షిణాత్యభాషల్లో విశేషమైన కృషిని, తులనాత్మక అధ్యయనాన్ని గావించిన మహనీయ సారస్వతమూర్తుల్లో ఆచార్య కోరాడ మహదేవశాస్త్రిగారు 20వ శతాబ్దంలో తెలుగు సాహిత్య సరస్వతి కంఠాభరణంలో తేజోవంతమైన ఒక నాయకమణి అంటే అతిశయోక్తికాదు. తన జీవిత చరమాంకంలోనూ భాషాసరస్వతిని అర్చిస్తూ 11-10-2016 తేదీనాడు ఆయన స్వర్గస్థులు కావడం ద్వారా తెలుగు సాహిత్యానికి తీరనిలోటు ఏర్పడినప్పటికిని ఆయన విద్యార్థులు, సాహితీవేత్తలు, భాషాభిమానుల హృదయాల్లో శ్రీ కోరాడవారు ప్రాతఃస్మరణీయులు.

జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తి తేషాం యశఃకాయే జరామరణజం భయం ॥

*****

'బ్రౌన్ పురస్కారం' ప్రదాన సభలో




'సౌశీల్య పురస్కారం' ప్రదాన సభలో




గంగాదేవి ఎమినెంట్ సిటిజన్ అవార్డు ప్రదాన సభలో...











'భాషా - సంస్కృతి' గ్రంథావిష్కరణ సందర్భంగా



'పరిశోధకాగ్రగణ్య' బిరుదును స్వీకరిస్తూ




'తెలుగు సంస్కృతి - భాషాసారస్వతములు'
గ్రంథావిష్కరణ సందర్భంగా



SAPNA వారి 'శ్రీకళాపూర్ణ' బిరుదు ప్రదానోత్సవం






నాన్నగారి తరపున 'మండలి వెంకటకృష్ణారావు పురస్కారం'
అందుకుంటూ రామకృష్ణ



డా॥ ఇనాక్ వారి పుస్తకాన్ని నాన్నగారికి
అంకితమిస్తూ



శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయ
తెలుగు శాఖ అధ్యాపక బృందం



గురుపూజాంజలి సందర్భంగా శ్రీ జి. ఆంజనేయులుగారు
వారి పుస్తకాలను గురువులకిస్తూ



శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయ తెలుగు శాఖ
మొదటి బ్యాచ్ విద్యార్థుల గురుపూజాంజలి



ద్రావిడ విశ్వవిద్యాలయ ప్రాంగణంలో మొక్కను
నాటుతున్న నాన్నగారు



శ్రీ రామశేషశాస్త్రిగారు వారి పుస్తకాన్ని నాన్నగారికి
అంకితమిస్తూ

# *Presented by....*



**Dr. K. Ramakrishna** specialized in English and chose the teaching profession. He got his Ph.D. Degree in American Literature with a teacher research grant from American Awards Authorization. He is the recipient of the AP State Level Best Teacher Award. His flair for English and passion for teaching helped the teacher in him to win the hearts of his students. He retired from service after serving in SSBN Junior College, Anantapur for 30 years. His special contribution is to train students of rural background to acquire proficiency in English language.

**Dr. Venkat Korada** is an entrepreneur with expertise in Chemical Technology, Biotechnology and Information Technology. Dr. Korada is the founder of 'Symmetric Systems LLC', a US based Biotechnology Company. He was a recipient of grants and fellowships from UNESCO, DST and DAE. He holds a Ph.D. in Chemistry from Delhi University and a Masters in Computer Science from the University of New Haven, CT. He was a Professor of Chemistry at Delhi University, and a Visiting Professor in the laboratory of Nobel Laureate Prof. Thomas A Steitz at Yale University School of Medicine. He is passionate about inculcating the spirit of innovation among youth and disseminating the knowledge in Indian Sciences and Technology.





**Smt. K. Vijayalakshmi** inherits the legacy of her parents. She has a keen interest in Indian culture and tradition. She is an active member of Chinmaya Foundation and has been training students in Bhagawadgeetha, Vishnusahasranamam and Sanskrit Slokas for Students for the past 20 years. Trained by her, many of her students won medals in national level competitions conducted by various organizations. Her interests include Sanskrit and Telugu literatures with special interest on streela pouranika patalu (Women's Pouranik Songs of earlier generations, generally unknown to present generation) on which she has been delivering talks in All India Radio (AIR) for the past 25 years. An active member of the Inner Wheel, she works for social cause and up liftment of society.

**Dr. Suryanarayana Korada** holds a doctorate degree in Sanskrit grammar from University of Pune in 1992. He worked in the field of Computational Linguistics, at the School of Computer & Systems Sciences, Jawaharlal Nehru University (JNU), Delhi during 1991-2001. He received the Young Scientist award of the Dept of Science & Technology, Govt of India, and worked for some time as Research Scientist of CSIR. He joined the Rashtriya Sanskrit Vidyapeetha, Tirupati in 2002 and since then actively worked in various fields of Sanskrit. Presently he is working as a Professor and his mission is to bring to light the works of his fore-fathers. He has guided four Ph.D's and twelve M.Phil. scholars and is the co-ordinator of five research projects.



*The family tradition continues...*

# విశ్వవిఖ్యాత భాషాశాస్త్రవేత్తకు
# 'వెన్నెల' అక్షర నీరాజనాలు

తెలుగు సాహిత్యానికి సరికొత్త చూపును ప్రసాదించిన
ఓ 'భాషా సంస్కృతి' పరిమళాల అమృతమూర్తి !
సామాన్యుడి 'వ్యాకరణ' దాత మీరు
అక్షరాకృతికి సొగసులద్ది
శబ్దానికి ప్రాణం పోసిన విధాత మీరు !
కాశ్మీర్ నుంచి కన్యాకుమారి దాకా...
మీ ఖ్యాతి దారి పొడవునా వెలుగులీనుతోంది !
'అనంత' నుంచి అమెరికా దాకా...
'శ్రీ కళాపూర్ణు' పై పయనిస్తున్న
అలుపెరగని సాహిత్య బాటసారీ !
మీరు పెట్టిన 'అక్షర' ప్రసాదంతో
ధన్యమైన విద్యార్థుల జీవితాలెన్నో !
మీ మాట....దివ్యమైన ఆనందాలకు నిలయం
మీ బాట....పరిశోధనా రంగానికి ఆలవాలం !
'శ్రీ కృష్ణ దేవరాయ' భువనవిజయ ప్రాంగణంలో
తెలుగుశాఖ మీ పాద స్పర్శతో పునీతమైంది !
ఓ భాషా పరిశోధకాగ్రగణ్యా !
మనిషికి మానవతా పరిమళాలద్దిన ఓ మహర్షీ ....!
అందుకోండి....మా 'వెన్నెల' అక్షర నీరాజనాలు.